# ప్రజ్ఞాభారతి



శ్రీముఖ వసంతం - శరత్తు 15 - 16



"నిందామాః సగురోర్గిరాం నసహతే సవ్యాకృతి వ్యాకృతి
ప్రజ్ఞావర్ధిత సాహితీ సుకవితా సర్వం కషః పావకిః"



"కల్పవృక్ష కుశలవ"

శ్రీ జువ్వాడి గౌతమరావుగారు

(కరీంనగర్)

మహాలక్ష్మి [illegible]

శ్రీ ప్రసన్న ఆంజనేయస్వామి వారి పాదపద్మములకు

20-4-1994

భావ – శ్రీరామ నవమి

మల్లంపల్లివారి లేఖ :–

"నిందామాః సగురోర్గిరాం నసహతే సవ్యాకృతి వ్యాకృతి
ప్రజ్ఞావర్థిత సాహితీ సుకవితా సర్వంకషః పావకిః"

[ వ్యాఖ్యాన సహితమైన వ్యాకరణ శాస్త్రంలోని ప్రజ్ఞచేత పెంపొందింప బడిన సాహిత్యంలోని సుకవిత్వంలో, సమగ్రమైన సామర్థ్యంగల ఆ 'పావకి' అనే పేరుగలవాడు, తన గురువుగారి కావ్యాలపై (ఇతరులు) చేసే నిందను క్షమించదు ; ఔరా!]

విశ్వనాథవారి సమాధానం :–

"యేన స్వీకృత శారదా కటితటీ కాంచీ క్వణత్కింకిణీ
స్వానామాన వచోభరేణ రసవారాశిస్తు గండూషితః"

[తనదిగా చేసుకోబడిన, శారదాదేవి కటి ప్రదేశంలోని మేఖలలో మ్రోగుతున్న చిరుమువ్వల మధురమైన ధ్వనికన్నా (ఏమీ) తక్కువ కాని వాగ్వైభవం కలిగిన, ఏ 'పావకి' చేత, రస సముద్రం పుక్కిలింప బడిందో, అటువంటి 'పావకి', గురువుగారి కావ్యాలపై (ఇతరులు) చేసే నిందను క్షమించదు!]

“నాకుం దమ్ముడు, పూలనెచ్చెలి, వసంతస్నాత చూతావనీ
శాఖాకోకిల, శ్రావణాభ్ర విలసచ్చాంపేయ రోచిస్సు, శ్రీ
రాకాచాంద్రమసీ నిశీథి యనుచున్, రమ్యాక్షర ప్రౌఢితో
వాకొందున్ శరభయ్య నార్ద్రకవితా స్వాదిష్ఠ కూలంకషన్ ! ”

— శేషేంద్ర

# చైతన్య కవిత

(మల్లంపల్లి శరభయ్యగారి కవితల ప్రత్యేక సంచిక)

15–16

శ్రీముఖ

వసంతం – శరత్తు

1993

Spring - Autumn

సంపాదకులు

తంగిరాల సుబ్బారావు

ఆర్వీయస్. సుందరం

చైతన్య కవితా వేదిక

ఆర్–2, జ్ఞాన భారతి

బెంగుళూరు 560 056.

CHAITANYA KAVITA a journal devoted to Telugu Poetry Published by Chaitanya Kavita Vedika, R-2, Jnana Bharathi, Bangalore University Campus, Bangalore- 560 056. April and October 1993, pp. xiv + 74

ముఖచిత్రం : సంస్కృతాంధ్ర సాహిత్య నిధి
పాండిత్య ప్రకర్ష నికషోపల పరిధి
కవితాసుధారస సింధువు
సరస సహృదయ బంధువు
విశ్వనాథ సాంద్రస్నేహ వశ్యుడు
కాటూరి కవి ప్రియశిష్యుడు
శ్రీ మల్లంపల్లి శరభయ్యగారు

అట్టవెనుక : 'కవి సమ్రాట్' విశ్వనాథ సత్యనారాణయగారు
( 1895–1976)
(శ్రీ జువ్వాడి గౌతమరావుగారు సంపాదించిన ఫోటో)

అక్షరాలంకరణ : ఆచార్య పి. సి. నరసింహారెడ్డి
(శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం , తిరుపతి)

వెల : రూ 20–00 ప్రత్యేక సభ్యత్వం : రూ 200–00
జీవిత సభ్యత్వం : రూ 500–00
పోషక సభ్యత్వం : రూ 1000–00

For copies : Prof. T.V.Subbarao
Chairman
Department of Studies in Telugu
Bangalore University
Jnana Bharathi , Bangalore 560 056

Dr. R.V.S. Sundaram
Department of Telugu
I.K.S. University of Mysore
Manasa Gangotri, Mysore 570 006

ముద్రణ : Compagers DTP Services
360, 10th Cross, M.L. Layout, Bangalore-86

# మనవి

చైతన్య కవిత మొట్ట మొదటినుంచీ కూడా ఆర్వీయస్ సుందరంగారి పర్యవేక్షణలో, మైసూరులో 'మిత్ర ప్రింటర్స్'లో అందంగా ముద్రింప బడుతూ వచ్చింది. 1986నుండి 1990 వరకూ పది సంచికలు నిరాఘాటంగా వచ్చాయి. తరువాత మా సుందరంగారు 1990లో తెలుగు విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరుగా నియమితులై, మైసూరునుండి రాజమండ్రీకి వెళ్లిపోవడం వల్ల, చైతన్య కవిత ముద్రణ కార్యం అస్తవ్యస్తమయిపోయింది. అందువల్ల 'ప్రజోత్పత్తి' (1991), 'అంగీరస'(1992) 'శ్రీముఖ' (1993) సంవత్సరాలలో వసంత సంచిక శరత్సంచికలు కలిపి ఏకసంచికగా ప్రచురింప వలసి వచ్చింది. ఇటీవల (1993 లో) సుందరంగారు రాజమండ్రీనుండి తిరిగివచ్చి మైసూరు విశ్వవిద్యాలయంలో చేరారు కాబట్టి, ఇక మీదట, అంటే 'భావ' (1994) నామ సంవత్సరంనుండి, సంవత్సరానికి రెండు సంచికలు ప్రచురించడానికి ఏర్పాట్లు చేసుకుంటున్నాము.

ఎందరో ప్రతిభావంతులైన కవులు, తమ కవితలను పుస్తక రూపంలో ప్రచురింపక పోవడంవల్ల, వారికవిత్వం, అసూర్యంపశ్యగా ఉండిపోతోంది. అటువంటి కవుల కవిత్వాన్ని రసజ్ఞులైన పాఠకులకు అందివ్వాలనే ఉద్దేశంతో చైతన్య కవితను ఆయా కవుల ప్రత్యేక సంచికగా వెలువరించాలనే ఆలోచన వచ్చింది. ఈ ఆలోచనను కార్యరూపంలో పెట్టడంలో తొలిమెట్టుగా శ్రీ మల్లంపల్లి శరభయ్యగారి కవితలను ఎన్నుకున్నాం. ఈ మాసంకల్పాన్ని మన్నించి, ఎక్కడెక్కడో పడివున్న తమ కవితలన్నింటికీ శ్రద్ధగా శుద్ధ ప్రతి వ్రాసి యిచ్చిన శరభయ్యగారికి మిక్కిలి కృతజ్ఞులం. శరభయ్యగారి కవిత్వాన్ని పరిచయం చేసిన 'యుగ కవి' శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారికీ, ఈ ప్రత్యేక సంచికను అంకితం పుచ్చుకుందుకు అంగీకరించిన ప్రియమిత్రులు శ్రీ జువ్వాడి గౌతమరావుగారికీ మా ప్రత్యేక వందనాలు.

యథా ప్రకారంగా ఈ సంచికను ముద్రించడంలో కూడా ఆర్థికంగా తోడ్పడిన మాన్యమిత్రులు, చైతన్య కవితా వేదిక అధ్యక్షులు శ్రీ D.K. ఆదికేశవులుగారికీ, ఉపాధ్యక్షులు శ్రీ బుల్లా సుబ్బారావుగారికీ మేము

ఎంతగా ఋణపడి ఉన్నామో మాటల్లో చెప్పలేం. వీరిద్దరి అండదండలూ లేకపోతే చైతన్య కవిత ఇన్నేళ్ళు బ్రతికేది కాదు.

వ్యక్తులకు సంబంధించిన ప్రత్యేక సంచికలతో పాటు, విప్లవ కవిత్వం, అనుభూతి కవిత్వం, మినీ కవిత్వం, స్త్రీ వాద కవిత్వం లాంటి వివిధ ఉద్యమ కవితల ప్రత్యేక సంచికలూ; ఒక్కొక్క దశకంలో వచ్చిన ఉత్తమ కవితల ప్రత్యేకసంచికలూ; 1995లో విశ్వనాథ, జాషువాల శతజయంతి ప్రత్యేక సంచికలూ తీసుకు రావాలనే సంకల్పం కూడా ఉంది.

ఈ శ్రీముఖ సంచిక సంయుక్త సంచిక అయినా, సుమారు 80 పుటలవరకూ ఉండడంవల్ల 'సంయుక్త' దోషాన్ని కొంతవరకూ పరిహరిస్తోందని భావిస్తున్నాం.

ఈ సంచికను అందంగా ముద్రించి ఇచ్చిన మిత్రులు శ్రీ కె. భీమేశ్వరరావు (కంపేజర్స్, బెంగుళూరు) గారికి మా కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాం.

—సంపాదకులు

డిసెంబర్, 1993

---

సవరణ

అంగీరస (1992) చైతన్య కవిత విజయవాడలో ముద్రించాం. ప్రూఫులు చూస్తామని చెప్పిన మిత్రులు మాట తప్పడంవల్ల దాంట్లో తప్పులు చాలా దొర్లాయి. ముఖ్యంగా పత్రిక చివరలో ఉన్న 'ఆలోచన వక్క', 'ఆకలి', 'పళ్ళెంవిరిగి', 'శ్రీనివాస్', 'కోయిల' అనే ఐదు కవితలను హైదరాబాదు విశ్వవిద్యాలయంలో ఇంగ్లీషు లెక్చరర్‌గా ఉన్న శ్రీ ఎం.శ్రీధర్‌గారు ఆంగ్లంనుండి తెలుగులోనికి అనువదించారు. కాని ఆ కవితల క్రింద వారి పేరు ముద్రింపబడలేదు. ఈ తప్పుకు మిక్కిలిగా చింతిస్తున్నాం. ఇక ముందు ఇటువంటి తప్పులు రాకుండా చూసుకుంటామని సవినయంగా మనవి చేసుకుంటున్నాం.

— సంపాదకులు

# అంకితం

సరసుడు
సహృదయుడు
సాహిత్యరసికుడు
సౌహార్ద పథికుడు
అసంఖ్యాత విశ్వనాథ చమూసమూహా స్కందుడు
నిరంతర కల్పవృక్ష గానామృత పారవశ్య
వసంత పరభృత స్వాంతుడు
మా
జువ్వాడి గౌతమరావు అన్నగారికి
భక్తితో . . . .

—సంపాదకులు

# భావుకుడు

నిజమునకు భావుకుండని
సృజనన్ బదివేలమంది సెవ్వడొ యొక్కం
డు జనించు, మెఱయు వానికి
రజనీపతి కాంతి భ్రూభర మ్మపుడపుడై.

వారిలో నొక్కరుండు జువ్వాడి వంశ
రజని కాంతుండు గౌతమరా వనంగ
కవికి నట్టిడు నొక చెలికాడు దొరకు
తొలుతటి జనుస్సులందలి చెలిమికాడు !

—కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ

(విశ్వనాథవారు తాము రచించిన 'భ్రష్టయోగి' ఖండకావ్య సంపుటిని శ్రీ జువ్వాడి గౌతమరావు గారికి అంకితమిస్తూ చెప్పిన పద్యాలు)

# కల్పవృక్ష కుశలవ !

మల్లంపల్లి శరభయ్య

1. శ్రుతిపక్వ హృదయ తంత్రీ
తత[1] మధుర గళాంత రామృతాసార దనా
హత[2] 'కల్పవృక్ష' నాద
ప్రతికల[3] సంవాద సకల భావుక హృదయా !

2. విశద రసవృత్తి చేతో
వశ విగళిత రసవిరోధి భౌమాంశ, విహా
యస వీథీ రాకాశశి!
కుశలమ్ములు 'కల్పవృక్ష కుశలవ'! నీకున్.

3. జువ్వాడి కడలి వేలుపు
బువ్వా! చదువరుల మొత్తములకున్ దలపై
పువ్వా ! మువ్వపు మొవ్వా !
కవ్విన కబ్బముల ప్రోవ ! గౌతమ రావా !

1. [ చక్కగా శ్రుతి చేసిన హృదయ తంత్రులు కలిగిన వీణయొక్క మధుర గళము నుండి అమృతధారా వర్షం వలె కల్పవృక్షనాదం నీ హృదయ చక్రం నుండి ప్రసారితమవుతోంది. ఆనాదం సకల భావుకుల హృదయాలతో మధురంగా సంవదిస్తోంది.
2. రస స్ఫూర్తితో, మైమఱపుతో, విరసుల హృదయాలలో కూడా వెన్నెలలు కురిపించడం కోసం, దివినుండి భువికి అవతరించిన పున్నమి చంద్రుడవు నీవు! కల్పవృక్ష (రామాయణ) గానం కోసం అవతరించిన కుశలవ స్వరూపా ! నీకు శుభమగు గాక !
3. 'జువ్వాడి' వంశాబ్ధి చంద్రుడా ! కావ్య పఠన విధాన శేఖరా! నునుచిగురు తాకిడివలె మృదువైన కంఠ స్వరం కలవాడా ! రసస్ఫూర్తిమైన బహుపద్యాల ధారణ కలిగిన మహనీయా! గౌతమ రాయా !]

1. తతము = వీణ ; 2. అమృత + ఆసారత్ + అనాహత = అమృత ధారావర్షంలా అవుతున్న హృదయ చక్రంలోని; 3. ప్రతికల = మధురమైన

'నిగర్వి' – 'స్నేహశీలి' – 'మహాభక్తుడు' – 'దానకర్ణుడు'

దళవాయి కృష్ణస్వామి నాయుడుగారి కుమారుడు

# శ్రీ ఆదికేశవులుగారికి

## ఆశీస్సు!

— తంగిరాల సుబ్బారావు

1.

'శ్రీ రమ్య వక్షుండు శ్రితవత్సలుండు
కారుణ్యధాముండు కనకాంబరుండు
వారిజ నేత్రుండు వనజ గాత్రుండు
శ్రీ రమాధీశుండు సిరులిచ్చుగాక !'

'నాగజందెమువాడు నాగభూషణుడు
నాగబంధము బొజ్జ నడికట్టు వాడు
బేసి కన్నులవాని పెద్ద కొమరుండు
వాసిగా మిముగాచు భాసమానముగ !'

2.

వీరుల వంశాన శూర కులాన
'దళవాయి' సంప్రదాన తళుకు చంద్రుండు
సరసుండు ఆ 'కృష్ణస్వామి నాయుండు'
పరగంగ 'రుక్మిణి'న్ బరిణయం బాడ
ప్రద్యుమ్నుడై పుట్టి భాగ్యముల్ వడసె—
కవిపండితుల పాలి కల్పవృక్షంబు
తనర అర్థుల దన్పు దాన కర్ణుండు
శ్రీనివాసుని గొల్చు శిష్ట భక్తుండు
కంచి శృంగేరీల నంచిత భక్తి
చిరకాలమున నుండి సేవించు ఘనుడు
(*) సత్యసాయిని గొల్చు నిత్య వ్రతుండు



(*) సత్యసాయిని పాద స్వర్ణ పద్మముల
నిత్యము విహరించు [illegible] తోట

సత్రాలు నిర్మించె క్షేత్రాలలోన
వేద శాఖలపూలు 'ఆది కేశవులు'—
'చెంగమ్మ'కన్నుల బంగారు బొమ్మ
'ముని వెంకటస్వామి' ముద్దు కూతురును
'సత్యప్రభా' దేవి సద్గుణంబులకు
మెచ్చి పెండ్లాడగా హెచ్చె సత్కీర్తి
వంశాభివృద్ధియు వరుసతో వచ్చె :
'తేజేశ్వరీ' దేవి, దివ్య 'కల్పజ'యు
'శ్రీనివాసు'ని తోడ సిరిమల్లె తోట !
మూడు పువ్వుల బాట, ముత్యాల మూట !!

3.

'బ్రహ్మ పుక్కిటి కొమ్మ ! పణతి మాయమ్మ !
ఒసరంగ శశిబింబ! ఓ శారదాంబ!
జగదంబ శారదయు జయమిచ్చు గాక !
కమల గర్భుడు మీకు విమల యశమిచ్చు !
కాపాడు మిమ్మెపుడు గౌరమ్మ మొగుడు !
శ్రీగిరి లింగంబు చెన్నకేశవుడు
ఏడుకొండలసామి ఎల్ల వేళలను
వరము లిచ్చుచునుండ వర్ధిల్లగలరు!!'

* * * *

శ్రీ మంజూషిక, భక్తరక్షణ కళా శ్రీచుంచు, వానంద వ
ల్లీ మంజు ప్రసవంబు, బిడ్డగన ప్రాలేయాంశువున్, మోక్ష ల
క్ష్మీ కౌ మాణిక్య వినూత్న మేఖల, కటాక్షీభూత నీహార రుక్
శ్రీమంతంబయి పొల్చు, వెల్గునొక డే సేవింతు, విశ్వేశ్వరా!

—విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము.
అవతారిక, 1.

'సరసుడు' – 'సహృదయుడు' – 'సాహిత్య రసికుడు' – 'సౌజన్య శీలి'
బుల్లా రాఘవయ్యగారి కుమారుడు

## శ్రీ బుల్లా సుబ్బారావుగారికి

### ఆశీస్సు!

– టి.వి.కె. సోమయాజులు

కళలో – కావ్య జగత్తులో – కదలు సంస్కారంబులో – 'నీడ'గా
వెలయున్ 'రుక్మిణి' లక్ష్మి రూపమున ! దివ్వెల్ బిడ్డలై వెల్గుకాం
తులలో మీరు శతాయు రభ్యుదయ సంతోషాల వర్ధిల్లుడీ!
లలితంబైనది నీ మనోంబుజము 'బుల్లా సుబ్బరాయాగ్రణీ !!

అల్లా, యెహోవ, రాములు,
ఎల్ల శుభంబుల నొసంగి ఎప్పుడు బ్రోవన్,
'బుల్లా సుబ్బారాయా!'
చల్లగ వర్ధిల్లు మయ్య ! సరస విధేయా !!

* * * *

కైలాసాచల సానువాసము, వృషస్కంధాగ్ర సంస్థాయి , త
త్ప్రాలేయాచల కన్యకా కుచతటీ పర్యంక నిద్రాగతం,
బాలోలాగ్ర జటాతటీ ఘటిత నాకౌకస్సరిత్కంబు, దే
హాలంకారిత లేలిహానము, వెలుం గర్చింతు, విశ్వేశ్వరా !

—విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము,
అవతారిక, 2.

# విషయ సూచిక

* * * *

# కవితారస కూలంకష

శివశ్రీ మల్లంపల్లి శరభయ్యగారు కృష్ణాజిల్లాలోని 'ఎలకుట్టు' గ్రామంలో 1928వ సంవత్సరం మార్చి నెల 27వ తేదీని జన్మించారు. వీరి తల్లిదండ్రులు: కనకదుర్గాంబగారు, మల్లికార్జునారాధ్యులవారు. ఆరేళ్ల వయస్సులోనే శరభయ్యగారికి తెలుగు కవిత్వంపై అమితమైన ఆసక్తి కలిగింది; గాఢమైన అభిరుచి పుట్టింది. దీనికి కారణం వీరి పెద్ద అన్నగారైన వీరమల్లేశ్వరశర్మగారు.

శరభయ్యగారు తన 11వ యేట పింగళి—కాటూరి విరచిత సౌందరనంద కావ్యాన్ని చదివి, తన్మయులై, ప్రశంసాపూర్వకంగా కొన్ని పద్యాలు వ్రాసి, కాటూరి వెంకటేశ్వరరావుగారిని కలిసి, ఆపద్యాలువారికి చదివి వినిపించారు. ఆ బాలకవి ప్రౌఢకవితాశక్తికి ఆశ్చర్యపోయిన కాటూరివారు, అతనిని బందరు తీసికొని వెళ్లి ముట్నూరి కృష్ణారావుగారికి పరిచయంచేశారు. అంతే, ముట్నూరివారి 'దర్బారు'లో బాలశరభయ్యగారు కూడా ఒక కవిగా చేరిపోయారు!

విద్యాభ్యాసం :

1935నుండి 1940వరకూ శరభయ్యగారు తమ తండ్రిగారివద్ద సంస్కృత కావ్యాలు, నాటకాలు, అలంకారాలు చదివారు. 1941 నుండి 1945వరకూ కాందూరి విష్ణుచిత్తాచార్యులవారి దగ్గర సంస్కృత వ్యాకరణం చదివారు. ఇదే కాలంలో ముట్నూరి కృష్ణారావుగారితో సాన్నిహిత్యం ఏర్పడింది. కృష్ణారావుగారి భార్య రుక్మిణమ్మగారు అనేక విలువైన సాహిత్య గ్రంథాలు శరభయ్యగారికిచ్చి చదివించారు. వాటిలో శ్రీకృష్ణకర్ణామృతం ఒకటి.

1941లో శరభయ్యగారు 'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారిని ప్రప్రథమంగా దర్శించారు. విశ్వనాథవారు బాలశరభయ్యగారి కవిత్వానికి ముగ్ధులై, 'బాలకవి కేసరి' అనే బిరుదునిచ్చారు. కాశీ కృష్ణాచార్యులువారు 'పుంభారతి' అనే బిరుదుప్రదానం చేశారు.

శరభయ్యగారు ఆంగ్ల సాహిత్యాన్ని అభ్యసించాలనే పట్టుదలతో 1945లో కమలాకర వెంకటరావుగారి దగ్గర ఎబీసీడీలు నేర్చుకున్నారు. తరువాత కాటూరి వెంకటేశ్వరరావుగారిని కలిసి ఆంగ్ల సాహిత్యాన్ని క్షుణ్ణంగా మథించారు.

సాంప్రదాయికంగా ఎంత చదువుకున్నా, డిగ్రీలు లేని సంస్కృత పాండిత్యం కూడు పెట్టదనే భయంతో, శరభయ్యగారు, 1946లో చిట్టిగూడూరు ప్రాచ్యకళాశాలలో 'భాషా ప్రవీణ' కోర్సులో చేరారు. అక్కడ ఉపన్యాసకులుగా ఉన్న తమ మూడవ అన్నగారైన వీరేశ్వరశర్మగారి దగ్గర తెలుగు ప్రబంధాలు, బాలప్రౌఢ వ్యాకరణాలు, ఇతర లక్షణ గ్రంథాలు చదివారు. 1949లో 'భాషాప్రవీణ' డిగ్రీని పొందారు.

**ఉద్యోగాలు :**

భాషాప్రవీణలో ఉత్తీర్ణులు కాగానే, ఒక సంవత్సరం పాటు (1949 – 50) చిట్టిగూడూరు ప్రాచ్యకళాశాలలోనే ఉపన్యాసకులుగా పని చేశారు. తరువాత 1950లో మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారంలో తెలుగుపండితుడుగా ప్రవేశించారు. 1959 వరకూ 10 సంవత్సరాల పాటు అక్కడ పనిచేసి,అనేక సంస్కృతాంధ్ర గ్రంథాలను పరిష్కరించారు. 1959లో రాజమండ్రికి వచ్చారు. అక్కడ ప్రభుత్వ బాలికోన్నత పాఠశాలలో సంస్కృత పండితుడుగా 1967 వరకూ పని చేశారు. తరువాత 1967 నుండి 1987వరకూ 20 సంవత్సరాల పాటు రాజమండ్రీలోని ఆంధ్రయువతీ సంస్కృత కళాశాలలో ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. 1990 నుండి 1992 వరకూ తిరుపతిలోని 'రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం' అని పిలువబడే సంస్కృత విశ్వవిద్యాలయంలో గౌరవ ఆచార్యులు (Honorary Professor) గా పని చేసి, సంస్కృతంలోకి, సంస్కృతంనుంచి అనేక అనువాదాలు చేశారు.

**రచనలు – పరిశోధనలు :**

మల్లంపల్లి శరభయ్యగారు తమ విద్యార్థిదశలోనే (1950కి పూర్వమే) అనేక కవితా ఖండికలు వ్రాసి 'భారతి' 'కృష్ణాపత్రిక'లలో ప్రకటించారు. 'భారతి'లో వరుసగా మూడుసంచికలలో 'సంవృతి మాధుర్యము' (the conceiled beauty) అనే చక్కటి విమర్శవ్యాసం వ్రాశారు. కాళిదాసు మాళవికాగ్నిమిత్ర నాటకాన్ని అనువదించారు.

శరభయ్యగారు మద్రాసులో ఉద్యోగంచేస్తూ ఉండగా, 1957లో, ప్రతివాది భయంకర వేదాంతాచార్యులుగారు, రామాయణ కల్పవృక్షాన్ని తీవ్రంగా విమర్శిస్తూ 'విశ్వనాథవారి రామలక్ష్మణులు' అనే వ్యాసం వ్రాసి 'భారతి' లో ప్రచురించారు. దీనికి శరభయ్యగారు చాలా కోపించి

'పావకి' అనే కలం పేరుతో, ఆవ్యాసాన్ని ఖండిస్తూ భారతిలో సమాధానం చెప్పారు. తిరిగి వేదాంతాచార్యులవారు 'కృష్ణా పత్రిక'లో వ్రాశారు. దానికి కూడా సమాధానం చెపుతూ, అదే పత్రికలో మన 'పావకి'గారు మరోవ్యాసం వ్రాశారు. విశ్వనాథవారు, శరభయ్యగారి విమర్శనా శక్తినీ తనమీది భక్తినీ ప్రశంసిస్తూ బెజవాడకు రమ్మని ఒక లేఖ వ్రాశారు. దానికి ప్రత్యుత్తరంగా శరభయ్యగారు ఈ క్రింది శార్దూలవిక్రీడిత శ్లోకంలో సగం వ్రాసి విశ్వనాథవారికి పంపించారు:

"నిందామాః సగురోర్గిరాం, నసహతే, సవ్యాకృతి వ్యాకృతి
ప్రజ్ఞావర్ధిత సాహితీ సుకవితా సర్వంకషః పావకిః"

సవ్యాకృతి = వ్యాఖ్యాన సహితమైన
వ్యాకృతి = వ్యాకరణ శాస్త్రమునందలి
ప్రజ్ఞా = ప్రజ్ఞతో (కలసి)
వర్ధితా = పెంపొందింపబడిన
సాహితీ = సాహితియందలి
సుకవితా = సుకవితయందలి
సర్వంకషః = సమగ్రమైన సామర్థ్యముగల
సః = ఆ
పావకిః = 'పావకి' అను పేరుగలవాడు
గురోః = గురువు యొక్క
గిరాం = వాక్కులయొక్క (కావ్యములయొక్క)
నిందాం = నిందను
నసహతే = క్షమింపడు
ఆః = ఔరా !

ఈ శ్లోకార్థాన్ని చదివి, విశ్వనాథవారు ఆనందభరితులై, శరభయ్యగారిని మిక్కిలిగా మెచ్చుకుంటూ మిగిలిన శ్లోక భాగాన్ని పూర్తి చేస్తూ ఈ క్రింది విధంగా వ్రాసి పంపించారు :

"యేనస్వీకృత శారదా కటితటీ కాంచీ క్వణత్కింకిణీ
స్వానామాన వచోభరేణ రసవారాశిస్తు గండూషితః"

స్వీకృత =తనదిగా చేసికొనబడిన
శారదా = వాగ్దేవత యొక్క
కటితటీ = కటిప్రదేశమునందలి
కాంచీ =మొలనూలు (మేఖల)యొక్క
క్వణత్ = మ్రోగుచున్న

కింకిణీ = చిరుమువ్వలయొక్క
స్వాన =మధురమైన (శబ్దముకన్న)
అనూన =తక్కువకాని
వచోభరేణ =వాగ్వైభవముగల
యేన =ఏ పావకిచేత
రసవారాశిః = రస సముద్రము
గండూషితః = పుక్కిలింపబడినదో
సః పావకిః = అటువంటి పావకి
గురోఃగిరాం = గురువుయొక్క వాక్కులయొక్క
నిందాం = నిందను
నసహతే = క్షమింపదు
ఆః ! = ఔరా!

(ఈ శ్లోకం వ్రాయుడంలో విశ్వనాథవారు హాస్యంకోసం ఒక చమత్కారం కూడా చేశారు. శరభయ్యగారికి నత్తివుంది. నత్తివారు 'క' కారాన్ని పలుకలేరు. 'క' కారాన్ని పలికేటప్పుడు నత్తి బాగాపట్టుకుంటుంది. అందువల్ల ప్రియమిత్రుణ్ణి కొంచెం వేళాకోళం చేయాలనే ఉద్దేశంతో 'కటీతటీ కాంచీ క్వణ త్కింకిణీ' అనే కకారభూయిష్ఠ సమాసం దొర్లించారు. ఈ విషయం విశ్వనాథవారే స్వయంగా మిత్రులతో చెప్పారు).

శరభయ్యగారు మద్రాసులో ఉండగానే తెలుగు భాషాసమితివారు విజ్ఞానసర్వస్వ సంపుటాలు ప్రకటించడం మొదలు పెట్టారు. వాటిలో తెలుగు సంస్కృతిని గురించి రెండు సంపుటాలు (మొదటిది 1959 లోను, రెండవది 1961లోనూ) ప్రకటించారు. రెండవ సంపుటిలో ఉన్న 'ధూర్జటి', 'నందిమల్లన – ఘంటసింగయ', 'మాదయగారి మల్లన', 'పాల్కురికి సోమనాథుడు' అనే వ్యాసాలు శరభయ్యగారు వ్రాసిన అమూల్య వ్యాసాలు.

శరభయ్యగారు రాజమండ్రీ వచ్చాక కూడా అనేక రచనలు పరిశోధనలు చేశారు. 1961 – 62 లో తమ ఇలువేల్పు (కులదైవం) అయిన భద్రకాళీశ్వరుడి మీద 'భద్రకాళీశ్వర శతకం' వ్రాశారు. (శతకం పూర్తికాలేదు, 60 – 70 పద్యాలవరకూ వ్రాశారు). నన్నయనుండి చిన్నయవరకూ గల ఉత్తమ గద్యలన్నీ సేకరించి 'ఆంధ్ర గద్య చంద్రిక' అనే పేరుతో ఒక గ్రంథాన్ని తయారు చేశారు. దీనిని 1965 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య

అకాడమీవారు ప్రచురించారు. 1980 లో కాళిదాసు 'విక్రమోర్వశీయం' నాటకాన్ని అనువదించారు. (దీనిని జనమంచి కామేశ్వరరావుగారు 1986 లో ప్రకటించారు. ఇది ప్రముఖ కవి పండితులు శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారికి అంకితం చేయబడింది). 1982 – 83 లో శ్రీ వేణుగోపాల శతకాన్ని రచించారు. దీనిని ఎక్కిరాల కృష్ణమాచార్యులవారు, తమ వరల్డు టీచర్ ట్రస్టు పరంగా ప్రచురించారు. 1987 – 88 లో 'శివలీలార్ణవము' అనే సంస్కృత కావ్యాన్ని తెలుగు వచనంలోకి మార్చారు. ఇది వేయిపుటల బృహద్గ్రంథం. అముద్రితం. కాళిదాసు కుమారసంభవ కావ్యాన్ని కూడా శరభయ్యగారు తెలుగు వచనంలో పెట్టారు. 1987 – 88 లోనే ములుగు పాపయారాధ్యులవారి 'కల్యాణ చంపువు' అనే సంస్కృత కావ్యాన్ని పరిష్కరించారు. ఇది ముద్రితం. శరభయ్యగారు రచించిన సాహిత్య వ్యాసాలను 1990 లో తెలుగు అకాడమీవారు 'సహృదయాభిసరణము' అనే పేరుతో ఒక పుస్తకంగా ప్రచురించారు.

తిరుపతిలోని సంస్కృత విశ్వవిద్యాలయంలో గౌరవ ఆచార్యులుగా నియమింపబడిన మల్లంపల్లి శరభయ్యగారు, 1990 – 92 మధ్యకాలంలో అనేకములైన ఉత్కృష్టరచనలు చేశారు. తాళ్లపాక పెదతిరుమలాచార్యులవారి శ్రీ వేంకటేశ్వర వచనాలను, శ్రీ వేంకటేశ్వర శతకాన్ని సంస్కృతంలోకి అనువదించారు. కాశ్మీరదేశ కవయిత్రి యోగిని అయిన 'లల్లాదేవి' వాక్కులను ముత్యాల సరాల ఛందస్సులో తెలుగుచేశారు. కన్నడంలోని బసవేశ్వర వచనాలను 500 సంస్కృత శ్లోకాలుగా అనువదించారు. ఇది ఆదిశంకరుల రచనలా భాసిస్తోంది. సంస్కృతంనుండి తెలుగులోకి కూడా అనేక రచనలు చేశారు. 14 వ శతాబ్ది నాటి విద్యారణ్యస్వామి సహాధ్యాయి అయిన వేదాంతదేశికుల దయాశతకాన్ని తెలుగు పద్యాలలో పెట్టారు. ఉపనిషత్తులలోంచి, పురాణాలలోంచి, సంస్కృత కావ్యాలలోంచి 300 సూక్తుల్ని ఎన్నుకొని 'సూక్తి సుధ' అనే పేరుతో తెలుగు పద్యాలలోకి మార్చారు. కాశ్మీర శైవుడైన అభినవగుప్తుడు రచించిన 'పరమార్థసారః' అనే గ్రంథాన్ని నూరు తెలుగు పద్యాలుగా అనువదించారు. ఈ గ్రంథాలన్నింటినీ రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠంవారు త్వరలో ప్రచురింపబోతున్నారు.

శరత్కాలపు వెన్నెల :

శరభయ్యగారి స్నేహం శరత్కాలపు వెన్నల వలె హాయిగా ఉంటుంది;

పుట్టతేనెలాగ తియ్యగా ఉంటుంది ; సంపెంగ (మనోరంజన్) పూల పరిమళంలాగ మత్తుగా ఉంటుంది. ఒక్కొక్కసారి తుమ్మెదలవంటి కొందరు మిత్రులకు ఈ మైత్రీ పరిమళాన్ని భరించడం కష్టమవుతుంది కూడా! స్వార్థపరులతో, పయోముఖ విషకుంభాలతో కూడిన ఈ యాంత్రికయుగంలో, అటువంటి స్వచ్ఛమైన మైత్రిని అస్వాదించడం కష్టతరం కావడంలో ఆశ్చర్యమేముంది? ఒకచిన్న ఉదాహరణం: ఒకసారి గుంటూరు శేషేంద్రశర్మగారికి 'హెర్పిస్ ' వ్యాధి వచ్చి, ఆయన అందమైన ముఖమంతా వికారంగా తయారయింది. ఎన్నిమందులు తీసుకొన్నా తగ్గడంలేదు. ఆసమయంలో శరభయ్యగారు ఒకసారి హైదరాబాదు వెళ్ళి శర్మగారిని చూచారు. చాలాబాధ పడ్డారు. (శరభయ్యగారికి శేషేంద్రశర్మగారు ప్రగాఢమిత్రులు). తిరిగి రాజమండ్రికి వెళ్లి పోయారు. అది ఎముకలు కొరికే చలికాలం. అయినాసరే శరభయ్యగారు ప్రతిదినమూ తెల్లవారు జామున లేచి, గోదావరి నదికి వెళ్లి, కంఠంలోతు నీళ్ళలో నిలబడి శేషేంద్రశర్మగారికి ఆరోగ్యం చేకూరాలని శివుణ్ణి ప్రార్థిస్తూ గంట సేపు రుద్రజపంచేసి వచ్చేవారు. ఆలా నలభై రోజులు చేశారు. ఈ విషయం శేషేంద్రశర్మగారికి తెలిసి, ఆనందాశ్చర్యాలతో చలించిపోయారు ! ఎలాగయితేనేం శేషేంద్రశర్మగారికి ఆరోగ్యం చేకూరింది. "శరభయ్యగారు నా ఆరోగ్యం కోసం ఇలా రుద్రజపం చేశారు. ఆయనది ఎంత గొప్ప మైత్రో చూడండి!" అని శేషేంద్రశర్మగారు చెవుతుంటే ఆయన రెండు కళ్లూ రెండు కల్హారసరస్సులుగా మారిపోయాయి. నేను శరభయ్యగారి స్నేహ సాంద్రతను తలుచుకొని ఆశ్చర్యచకితుణ్ణి అయ్యాను!

తాటాకుమంట :

శరభయ్యగారి కోపం తాటాకుమంట లాంటిది. ఒక క్షణంలో దుర్వాసమహర్షి అయిపోతారు; మరుక్షణంలో బుద్ధమూర్తి అయిపోతారు. అన్యాయాన్ని, అక్రమాన్ని, నీచత్వాన్ని, అజ్ఞానాన్ని, డాంబికాన్ని, పాండిత్యబ్రువుల్ని, పైకి పటారం లోన లొటారం సాహిత్యవేత్తల్ని, కుకవుల్ని, అకవుల్ని, రాజకీయ కవుల్ని, ప్రాచీన సాహిత్య వైభవాన్ని గుర్తించలేని మూర్ఖుల్ని, తలచుకొంటే శరభయ్యగారు దుర్వాసమహర్షి అయిపోతారు. ఆ అజ్ఞాని తన అజ్ఞాన్ని గుర్తించి శరణు వేడితే వెంటనే ఆయున బుద్ధమూర్తి అయిపోతారు. నిజమైన, పాండిత్యం కవితాశక్తి, రసజ్ఞత ఉన్న వ్యక్తుల్ని తనచెలిమివెన్నలతో పునీతం చేస్తారు.

**సమచిత్తం:**

మల్లంపల్లి శరభయ్యగారు ఉత్తమకవి, ఉత్తమ పండితుడు మాత్రమే కాదు. పక్షపాత రహితమైన సహృదయ విమర్శకులు కూడా. అందువల్లనే వసుచరిత్రాది ప్రౌఢ ప్రబంధాలతో పాటు, ఎండ్లూరి సుధాకర్ గారి 'వర్తమానం' లాంటి వచన కవిత్వం కూడా ఆయన ప్రశంసకు పాత్రమయింది. ఇది మల్లంపల్లివారి సమచిత్తానికి నిదర్శనం.

**పితృవాక్య పరిపాలన :**

మల్లంపల్లి శరభయ్యగారు ఇంతటి మహాపండితుడు ఎలా కాగలిగారు ? అనే ప్రశ్న మన మనస్సులో పుట్టవచ్చు. వారి పితృవాక్య పరిపాలనా దీక్షయే దీనికి సమాధానం. శరభయ్యగారి తండ్రి మల్లికార్జునారాధ్యులవారు తమకొడుకుల్ని చూసి, వారితో పదేపదే ఇలా అనేవారట : 'నాయనలారా ! మీరు డబ్బులేక దరిద్రులైతే నేను బాధపడను. కాని పాండిత్యంలేక దరిద్రులైతే మాత్రం నేను ఎక్కడున్నాసరే మీకోసం అలమటిస్తాను. జాగ్రత్త !'. శరభయ్యగారు మొదటిరకం దారిద్ర్యాన్ని తప్పించుకో లేకపోయారు. కాని రెండవరకం దారిద్ర్యం తమ ఛాయల్లోకి కూడా రాకుండా కట్టుదిట్టం చేసుకున్నారు. నిత్యం పాండిత్య సిరిసంపదలతో తులతూగుతున్నారు.

**మార్క్సిస్టు :**

ఒకసారి శరభయ్యగారు, 'మార్క్సిజం అంటే ఏమిటండీ ?' అని శేషేంద్రశర్మగారిని అడిగారట. అప్పుడు శర్మగారు 'ఏ దేశ సంపద అయినా సరే శ్రమశక్తిమీద ఆధారపడి వుంటుంది. ఆ శ్రమ శక్తిని కొందరు పెట్టుబడిదారులు దోచుకొంటూ, ధనికులవుతున్నారు. ఈ దోపిడీ ఇలా కొనసాగుతూవుంటే ధనికులు ఇంకా ధనికులైపోతారు. పేదవాళ్లు ఇంకా పేదవాళ్ళయిపోతారు. ఒక దశలో ఆ నిరుపేదలు తిరుగబడతారు. సంఘర్షణ వస్తుంది. అప్పుడు ధనికులు పేదవాళ్లు అనే వర్గ సమాజం పోయి, సమ సమాజం పుడుతుంది. అందరికీ చేతినిండా పని వుంటుంది. అందరికీ కూడూ గూడూ గుడ్డా వుంటాయి. దేశ సంపదకు మూల భూతులైన శ్రమజీవులే దేశానికి పాలకులవుతారు. కార్మికులూ కర్షకులూ సుఖిస్తారు. పీడితులూ, తాడితులూ ఇక ఉండరు' అని వివరించారు. ఇది విన్న వెంటనే మల్లంపల్లి శరభయ్యగారు పరమానంద భరితులై 'అలా

అయితే మనమంతా మార్క్సిస్టులమే' అన్నారు.

### విశ్వనాథవారి సాంగత్యం :

మల్లంపల్లి శరభయ్యగారి కవితాశక్తి, పాండిత్యం, రచనలు, పరిశోధనలు, అనువాదాలు – అన్నీ ఒక ఎత్తు ; కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారితో వీరికి ఉన్న అత్యంత ఆత్మీయమైన స్నేహం ఒక ఎత్తు. విశ్వనాథవారి 'తొలిజనుస్సులందలి చెలిమికా'డైన జువ్వాడి గౌతమరావుగారి లాగే, మల్లంపల్లి శరభయ్యగారు కూడా, విశ్వనాథవారికి కేవలం ఈ జన్మలో మాత్రమే మిత్రుడు కాడు; అనేక పూర్వజన్మలనుండి మిత్రుడు ! ప్రాణసఖుడు !

"విశ్వనాథవారి పద్యాలు చదివాక చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి మీద నాకున్న వ్యామోహం పోయింది. విశ్వనాథ ప్రతిపద్యం నన్ను బ్రహ్మ రాక్షసుడిలా పట్టుకుంది....... గొప్ప కవులు వ్రాసిన ప్రతి పద్యానికీ ఒక ఆత్మ వుంటుంది. సత్యనారాయణగారి పద్యాలు అల్లాంటివి" అంటారు శరభయ్యగారు.

వాల్మీకి రామయణాన్ని గానం చేసి వ్యాప్తి చేయడంలో, క్రీ.పూ. ఆరు వేల సంవత్సరాల నాడు కుశలవులు ఎలాంటి పాత్ర నిర్వహించారో, సరిగ్గా అలాంటి పాత్రనే ఈ నాడు మల్లంపల్లి శరభయ్యగారూ, జువ్వాడి గౌతమరావుగారూ నిర్వహిస్తున్నారు. కల్పవృక్ష కావ్యగానం ఈ ఆధునిక 'కుశీలవుల' నోటవినడం ప్రతివ్యక్తికీ జీవితంలో ఒక మధురానుభూతి ! రాజమండ్రీలో శరభయ్యగారు చేసిన కల్పవృక్ష ఉపన్యాసాలు విని, వడలి మందేశ్వరరావుగారు ఉత్తేజితులై 'ఇదీ కల్పవృక్షం' అనే ఉత్కృష్టమైన విమర్శగ్రంథాన్ని రచించారు. (1977 నుండి చన్నాప్రగడ తిరుపతిరావుగారూ నేనూ కలసి బెంగుళూరు విశ్వవిద్యాలయంలో ప్రతిసంవత్సరం 'విశ్వనాథ జయంతి' జరుపుతున్నాం. ఎందరో కవిపండితులు వచ్చి ప్రసంగించారు. కాని 1990 లో శరభయ్యగారు వచ్చి ప్రసంగించాకనే కల్పవృక్షంలోని నిజమైన కవితావైభవం నా మనస్సుకెక్కింది).

శరభయ్యగారు విశ్వనాథవారికి ఆప్తమిత్రుడు మాత్రమే; శిష్యుడుకాడు. (తాను కాటూరి వెంకటేశ్వరరావుగారి శిష్యుడనని మాత్రమే శరభయ్యగారు చెప్పకుంటారు). విశ్వనాథవారు కూడా శరభయ్యగారి నెప్పుడూ

తన శిష్యుడుగా చూడలేదు ; ప్రియసఖునివలె గొప్ప గౌరవ భావంతో సంభావించేవారు. దీనికి ఒక చిన్న ఉదాహరణ : ఒకసారి విశ్వనాథవారు ఏదో సాహిత్య సభలో పాల్గొనేందుకు రాజమండ్రీ వచ్చారు. అప్పుడు రాజమండ్రీలో ఉన్న శరభయ్యగారు విశ్వనాథవారితో "అయ్యా! నేను మీతో ఒక ఫోటో తీయించుకోవాలి" అన్నారు. దానికి విశ్వనాథవారు "అలాగే ! దానికేముంది ? అయితే ఒక షరతు. ఫోటో తీసేటప్పుడు మీరు కుర్చీలో కూర్చోవాలి. నేను మీ ప్రక్కన నిలబడతాను" అన్నారట. శరభయ్యగారు చాలా ఇబ్బంది పడిపోయారు. ఎంత బ్రతిమాలినా విశ్వనాథవారు తన ప్రక్కన కూర్చుందుకు ఒప్పుకోలేదు. విధిలేక, విశ్వనాథవారితో తనకు ఒక ఫోటో ఉండాలనే తాపత్రయంతో శరభయ్యగారు స్టూడియోకి వెళ్లి, విశ్వనాథవారి షరతుకు అంగీకరించి, ఒక ఫోటో తీయించుకున్నారు. "ఆ ఫోటోను చూస్తూంటే ఇప్పటికీ నేను సిగ్గుతో చచ్చిపోతాను. ఆ మహాకవి నా ప్రక్కన నుంచోవడ మేమిటీ ?" అంటూ బాధపడిపోతూవుంటారు శరభయ్యగారు. కాని విశ్వనాథవారి మనస్సులో మల్లంపల్లి శరభయ్యగారికి ఎంతటి మహోన్నతస్థానముందో ఈ ఫోటోను బట్టి మనం ఊహించుకోవచ్చు. "శరభయ్యగారు నాకన్నా బాగా చదువుకున్న పండితుడు. నాకన్నా బాగా కవిత్వం చెప్పగలడు" అని విశ్వనాథవారి మనస్సులో ఉంది కాబోలు. దానిని ఆ ఫోటో రూపంలో వ్యక్తీకరించారు కవిసమ్రాట్!

తనలో గొప్పకవితాశక్తి ఉండి కూడా, శరభయ్యగారు తక్కువ కవిత్వం వ్రాయడానికి కారణం, తాను విశ్వనాథవారి మహోన్నత కవితాప్రవాహంలో నిమగ్నులై కొట్టుకొని పోవడమే! విశ్వనాథవారు, తన చివరి రోజులలో ఒకసారి, శరభయ్యగారితో "నాయనా! నీ కవిత్వం చదువు, వింటాను" అన్నారట. దాని శరభయ్యగారు "అయ్యా ! నిత్యం మీకవిత్వాన్ని చదవడంతోనే నా జీవితమంతా అయిపోయింది. ఇంక నా కవిత్వ సృష్టికి వ్యవధి ఎక్కడ?" అని జవాబిచ్చారట. ఈ మాటలు వినగానే విశ్వనాథవారి రెండు కళ్ళనుండీ, కొబ్బరికాయ పగులగొట్టినట్టుగా ధారాపాతంగా అశ్రువులు కారాయట ! మర్నాడు ఆయన కనకదుర్గగుడిలో ఒక పెద్ద సాహిత్యసభ చేసి, శరభయ్యగారినీ, జంధ్యాల పాపయ్యశాస్త్రిగారినీ, మరో ఇద్దరు కవులను పిలిపించి గంటల తరబడి వారి కవిత్వాలు చదివించుకొని విన్నారట ! వినిన తరువాత శరభయ్యగారిని తప్పించి, మిగిలిన ముగ్గురు

కవుల కవితల్నీ విశ్వనాథవారు వ్యాఖ్యానించారట ! శరభయ్యగారి వైపు తిరిగి, "నాయనా ! నీ కవిత్వాన్ని నేను నా కళ్ళతో చదివి ఆనందించాలి. చక్షురక్షర సంయోగంతో సంతోషించాలి. ఇలాయివ్వు" అని శరభయ్యగారి కవితలు పుచ్చుకున్నారు. చదివారు కాబోలు ; ఆనందించారు కాబోలు ; ఏమీ వ్యాఖ్యానించకుండానే ఈ సంఘటన జరిగిన కొద్దిరోజులకే స్వర్లోకవాసులయ్యారు విశ్వనాథవారు !

పై రెండు సంఘటనలనూ మననం చేసుకొంటే, మల్లంపల్లి శరభయ్యగారి సత్తా ఏమిటో మనకు తెలిసి వస్తుంది!

మహద్భాగ్యం :

మల్లంపల్లి శరభయ్యగారు తమ కవితలన్నింటినీ పుస్తకరూపంలో తీసుకురావాలని ఎన్నాళ్లనుంచో, ఎన్నేళ్ళనుంచో కలలు కంటున్నారు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి వంటి ఉత్తమోత్తమ కవి, శరభయ్యగారి కవితలంటే చెవికోసుకొనేవారు ! గుంటూరు శేషేంద్రశర్మగారి లాంటి యుగకవికి శరభయ్యగారి కవితలంటే పంచప్రాణాలు! ఆయిద్దరు కవివతంసులూ శరభయ్యగారి కవితల్ని పుస్తక రూపంలోకి తేవాలని చాలా తాపత్రయ పడ్డారు. కానివారి ప్రయత్నాలు ఫలించలేదు. ఆ అదృష్టం, ఇన్నేళ్ల తరువాత మా చైతన్య కవితకు కలగడం మాకు గర్వకారణం. శేషేంద్రశర్మగారు చెప్పినట్టుగా మల్లంపల్లి శరభయ్యగారంటే "అర్వాక్కవితా స్వాదిష్ఠకూలంకష!" ఆ మెత్తని కవిత్వపు మిక్కిలి తియ్యనైన రసస్రవంతిలో ఓలలాడే అవకాశాన్ని సహృదయులకు కల్పించడం మా మహద్భాగ్యంగా భావిస్తున్నాం.

—తంగిరాల సుబ్బారావు

శ్రీనందమూరు నిలయా !
ప్రాణాంతర్దీపికా ! కృపాపరతంత్రా !
నానా నిగమ శిఖోగ్ర
జ్ఞానాకృతి! భక్తజనవశా! విశ్వేశా !!

—విశ్వనాథ, (రామాయణ కల్పవృక్ష ప్రారంభం)

# పూల నెచ్చెలి

—గుంటూరు శేషేంద్రశర్మ

రసజిగ్రహిషా ఋషిమై,
విస్మృమర త్రైలింగ కల్పవృక్షచ్ఛాయా
వసదమృతాంధః ప్రభువై
యెసగును శరభాఖ్యశర్మ ఇద్ధయశుండై !

సఖుడాతండు మదీయ హార్దిక మహా సామ్రాజ్య సింహాసనం
బఖిలంబున్ గొని యాక్రమించి, నను నేయానంద వైహాయసీ
శిఖరాగ్రంబులకో తరల్చి నతడే చిక్రోడమై శాఖలన్
ముఖరించెన్ భవదామ్ర కమ్ర కవితా మూర్ధన్య దేశమ్ములన్.

నాకుం దమ్ముడు, పూలనెచ్చెలి, వసంతస్నాత చూతావనీ
శాఖాకోకిల, శ్రావణాభ్ర విలసచ్చాంపేయ రోచిస్సు, శ్రీ
రాకా చాంద్రమసీ నిశీథి యనుచున్, రమ్యాక్షర ప్రౌఢితో
వాకొందున్ శరభయ్య నార్ద్ర కవితా స్వాదిష్ఠ కూలంకషన్ !

కవియొక చందమామ, తన కావ్యము వెన్నెల పూసుకున్న వ
స్తువుల జగత్తు, వాఙ్మయ మధువ్రతుడైన కృతీశమౌళియో
నవరస పశ్యతోహరుడు, నమ్ముడ నేనిక నేమిచెప్పదున్
ధవళిమ వెల్లిగొన్న కలధౌత మయంబు సమస్త మిచ్చటన్.

(కరుటూరి సత్యనారాయణగారు తమ 'ఆమ్రపాలిక' కావ్యాన్ని మల్లంపల్లి శరభయ్యగారికి అంకితం చేసినప్పుడు, శేషేంద్రశర్మగారు చెప్పిన పద్యాలు. ఇటీవల వెలువడిన శేషేంద్ర కావ్యకృతి 'జనవంశమ్' నుండి).

* * * *

ఎదకు పురాంధ్ర సంస్కృత కవీశ్వర భారతి దీప్తి కల్గినన్
సదమల బుద్ధికిన్ బహుళ శాస్త్ర రహస్య వివేక మబ్బినన్
మదికి సుదాత్త కల్పనల మక్కువ కల్గిన విశ్వనాథ శా
రద సకలార్థదాయిని సురద్రువు రామకథన్ భజింపు మీ !

— **విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము, అవతారిక, 35.**

# మందార పుష్పంధయుడు

—ధూళిపాళ శ్రీరామమూర్తి

"నాకన్నన్ పదియేండ్లు చిన్న, అయినన్ భావింతు నే నన్నగా,
వాకుల్ వానివి వెన్నకన్న మృదువుల్ వర్షాంబు శీతంబులున్,
వాకోవాకము సేయు వాని గనినన్ వాగ్వైఖరీ శ్రీకతన్
స్వాకారమ్ముగ కోకిల మ్మతని కామాక్షీ! కటాక్షింపవే!"

"ఎల్లన్ పూర్వకవీంద్ర పద్యములలో నేదేని నే నెత్తినన్
జిల్లించున్ దొలికారు మబ్బువలె ఆపాంతంబు పాంతంబునన్
మల్లంపల్లి కులీనుడౌ శరభయ్యన్ మందార పుష్పంధయున్
మల్లీగుచ్ఛ పరీమళద్వచసు, కామాక్షీ ! కటాక్షింపవే ! "

(ధూళిపాళవారు తమ చివరి రోజులలో 'కామాక్షీ పంచశతి' అనే కావ్యాన్ని వ్రాస్తూ, మల్లంపల్లివారి మీది ప్రేమకొద్దీ, ఆ దేవీస్తుతి మధ్యలో పై రెండు పద్యాలూ చేర్చి వ్రాశారు).

*  *  *  *

మఱల నిదేల రామాయణంబన్నచో
    నీ ప్రపంచకమెల్ల నెల్లవేళ
దినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్ళు
    తన రుచి బ్రదుకులు తనవిగాన
చేసిన సంసారమే సేయుచున్నది
    తనదైన యనుభూతి తనదిగాన
తలచిన రాముసే తలచెద నేనును
    నా భక్తి రచనలు నావిగాన
కవి ప్రతిభలోన నుండును గావ్యగత శ
తాంశములయందు దొంబదియైన పాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాద్భుతుని మించి

— విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము, అవతారిక, 5

# వాఙ్మయ పర్జన్యము

— శతావధాని డా. మేడసాని మోహన్

శ్రీ సారస్వత రాజ్యసీమ ప్రతిభాసింహాసనాధీశ్వరో
ల్లాస స్ఫూర్తి, రసాంగనామణిని పార్శ్వంబందునన్ దాల్చి, ఉ
ద్భాసింపంగల వాఙ్నిరూఢు శరభోపాధ్యాయ సర్వజ్ఞు వాక్
వ్యాసంగంబులు మన్మనోజగతి సంభావించు కైలాసముల్.

ఏ సుధీమణి వచోహేలావిశేషంబు
వాఙ్మయ పర్జన్య వర్షధార
ఏ మహాదీక్షితు హృత్సీమ పర శివ
హంసీ విహార పద్మాకరంబు
ఏ మహా భాగుని మృదుభాషణంబులు
కవితా మహోద్యాన పవన వీచు
లే రసాత్ముని చూపు లిందు మండలములై
వాత్సల్యసుధల కావాసములగు
నతడు మల్లంపల్లి వంశాబ్ధి విధుడు,
నిత్య సత్యలోక విహార నిరత బుధుడు,
సంస్కృతాంధ్ర సాహిత్య వచస్సుధార
సముల శిష్యామరుల దన్పు సహృదయుండు.

పరమేశ్వర లింగాకృతి
కరచరణాద్యవయవాంక కలితంబై గో
చరమౌనటు మల్లంపలి
శరభ గురుని రూపదీప్తి సతతము తోచున్.

* * *

తెలుగు పద్యం ఒక కులీన సంస్కృతి ; మానవీయ సంస్కారంలో సమగ్రత రావాలంటే అనేక సాంస్కృతిక ద్రవ్యాలు సేవించాలి ; వాటిలో పద్యం అనే సుగంధద్రవ్య మొకటి.

— శేషేంద్ర

# ఆశంసనము

—ఎక్కిరాల కృష్ణమాచార్య

ఉత్తమ కవులకు జీవితమొక సారస్వత సత్త్రయాగము. వారు చదువుకొన్న కావ్యముల కర్తలు వారి అంతరంగమను సత్త్రశాలలో ఆజన్మాంతము సన్నిధి చేసియుందురు. శరభయ్యశర్మలోగల లోగిలి బహుసహస్ర మహాకవులకు సత్త్రశాల. అంతేకాదు, ఆ కవులందరు అవకాశము కలిగినపుడెల్ల అతని జిహ్వాగ్రమున నిలిచి కూనిరాగములు తీయుచుందురు. ఇతనికి పుస్తకాపేక్ష లేదు.

ఈ కవికి జీవితము సాహిత్యజీవితము వేఱు కావు. ఇతడొక రసోన్మత్తుడు. ఒక పదివేల సంవత్సరములు ఏకాంతముగా నుండుమన్నను పూర్వకవులతో నిరంతర సల్లాపములు చేయుచుండగలడు. పూర్వ జన్మలలో చేసినను చేసి యుండవచ్చును. అప్పటి మాధుర్య స్రవంతి యిప్పటి జీవిత ఘట్టములచే అతిరస్కృత మూర్తిమంతము. లేనిచో భౌతిక జీవిత ఘట్టముల ప్రభావమున నితడు పిచ్చివాడై యుండవలసినది. ఇదికూడ ఇతని సాహిత్యోన్మత్తతకు కారణమేమో? ఒక మాట మాత్రము నిజము. ఇతని ఐహిక జీవితము నితడు జీవించుటలేదు.

(16–12–1981 నాడు శరభయ్యగారి శ్రీ వేణుగోపాల శతకమునకు వ్రాసిన పీఠికనుండి).

* * * * *

వ్రాసిన రామచంద్రు కథ వ్రాసితివం చనిపించుకో వృథా
యాసముగాక కట్టుకథ లైహికమా ? పరమా ? యటంచు దా
జేసిన తండ్రి యాజ్ఞయును జీవునివేదన రెండు నేకమై
నా సకలోహవైభవ సనాథము నాథకథన్ రచించెదన్

— విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము, అవతారిక, 7

# సరస్వతీ అవతారుని హృదయగ్రాహి పద్యాలు

శ్రీ శరభయ్య సరస్వతి అవతారము. పూర్వ గీర్వాణాంధ్ర కవులందరూ ఆయన రసనాగ్రమెక్కి తమ ఘనతను చాటుకుంటారు; తమ కీర్తిపతాకను ఎగుర వేస్తారు. ఆయన వాక్కు మేరువులా ఆ దేవతల నివాస స్థానము. కనకనే గంగా ప్రవాహం లాంటి ఆయన పద్యసందోహంలో ఆ కవుల పావనా కృతులు పుష్ప నౌకల్లా తేలుతూ పోతుంటాయి. "శ్రీ వాణీ కర ధూత చామర శిఖా శీతాని లానీత సం/సేవా సంవలి తాలకమ్ము, హసిత శ్రీ లాసి కాలాస్య వీ/థీ విద్యోత నవారుణాధరము...." అని ఆయన అంటూ ఉంటే "ఉదయ గ్రావము పానవట్టము" అనీ, "భస్మోద్ధూళన పాండురాంగము" అనీ, లేక "ధూతాతంక మపేత పంకము" అనీ, లేక "శీతాహార్య సుతాళినీ వికచ రాజీవంబు విశ్వేశ్వర జ్యోతిర్లింగ విశుద్ధ రత్నఖని " లాంటి జాజ్జ్వల్య మానమ్ములైన ఉల్కలు ఎక్కడినుంచో సారస్వత రోదసి లోనుంచి మన మనోమండలం మీదికి రాలుతుంటాయి. "రింఖత్తరంగాగ్ర కంకణ మై కృష్ణ" అనగానే "పంపాతరంగ రింఖణ ఝంపా సంపాత్యమాన విలకణ రేఖా" అని ఒక ఉల్క రాలుతుంది.

"ఎవ్వాడు డాచేతి క్రొవ్వాడి నఖమున
 చిదిమె భాషాదేవి చిగురుముక్కు,
కనకమేఖల గ్రుచ్చి కట్టె నెవ్వడు లీల
 జెఱుగుపై పూషార్కు మెఱుగు పండ్లు,
కొసరకెవ్వడు పదాంగుష్ఠ భాగంబున
 ఉడురాజు పొట్ట గుంజురుక నూదె,
తరిగె నెవ్వడు ఖడ్గ ధారాంచలంబున
 నగ్ని నాలుక లేదు నంటదరిగె,
మోదె నెవ్వాడు ముప్పది మూడు కోట్ల
వేలుపుల బారబార వెన్వెంట దరిమి,
యట్టి శ్రీ వీరభద్రు డీయద్రి మీద
భద్రకాళియు దా నుండు బద్మనయన "

– అనే సముద్దండ వేదండంలాంటి శ్రీనాథ సీస పద్యాన్ని శ్రీ శరభయ్య ఎలాతన పిడికిటి మీద పడుకో బెట్టాడో చూడండి:

"స్వాహానాయకు నాల్కలంటదెగి, పూషాదిత్యు పండ్లూడి, త
న్నీహార ద్యుతి కంది డింది, తెగివాణీ నాస, నెమ్మె, తురా
సాహం డోహటిలన్ నటింప గణముల్ సాహోనినాదార్భటిన్
త్రాహి త్రాహి ఘటింపవే విధికి ? భద్రా! భద్ర కాళీశ్వరా ! "
(భద్ర కాళీశ్వరా !)

ఆయన , పద్యం చేత నైకభంగిమల్లో నాట్యం చేయిస్తాడు. ఆయన సీసపద్యాలు రాజమార్గంలో అడుగుపెట్టిన ఐరావతాల మందలు ; ఆయన శార్దూల మత్తేభాలు ప్రమథ గణాల చిందులు. ఆయన పద్యంలో ఒక్కో పాదం ఒక్కో చెరుకుగెడ; ఆ గెడలో కణుపులే గణాలు! "పుండ్రేక్షు పాశాంకుశ పుష్పబాణ హస్తే నమస్తే జగదేక మాతః "

శరభయ్య సూక్తుల సౌరభాల్లో ఆయన వాల్మీకిది స్త్రీ ప్రకృతి అన్నాడు. ఎంత కావ్యతత్త్వగర్భ నిర్భరమైన మాట ! కావ్యం కాంతా సమ్మితము గదా. లొల్ల లక్ష్మీధరుడు తన సౌందర్యలహరి వాఖ్యారంభంలో అంటాడు, "వందే మహి మహీయాంసం | అంస లంబి జటాధరం | యత్కంకణ ఝణత్కార రవ శ్శబ్దాను శాసనమ్" || ఆ జగన్మాతయే మధు స్వరూప అయిన కవిత్వదాయిని. (మధు మేధయా బ్రహ్మ మేధయా......)

తెలుగు పద్యం ఒక కులీన సంస్కృతి ; మానవీయ సంస్కారంలో సమగ్రత రావాలంటే అనేక సాంస్కృతిక ద్రవ్యాలు సేవించాలి ; వాటిలో పద్యం అనే సుగంధద్రవ్య మొకటి. అయితే పద్యరసాస్వాదన కోసం ఒక ప్రత్యేక శిక్ష అవసరం. అక్కరలేదనుకునే వాడికి అలా అనుకోడానికి స్వేచ్ఛ ఉంది. ఇతరుల విషయం – ఒక మధురానుభవం సిద్ధింప జేసుకోడానికి ఒక ఆరాధన అవసరం. దానికి కావలసిన పుష్పాలు విష్ణుచిత్తుడు కోసి తెచ్చినట్లు

తెచ్చుకోవాలి ; ఫలాలు శబరిలా రుచిసూక్ష్మం తెలుసుకుని కొమ్మల నుంచి కోమలంగా తెంచుకుని రావాలి. నేలమీద కూర్చుని సానమీద శ్రీగంధపు చెక్క చాది చాది తీసి గంధం తెచ్చుకోవాలి. అవి పూజా ద్రవ్యాలు. అలాంటి ద్రవ్యాలతో ఆరాధన చేస్తేనే ఆస్వాదన సిద్ధిస్తుంది. ఆ విధంగా శబ్దార్థాల స్వభావంలోఉన్న నాజూకుదనం తెలిసి ఏ సందర్భానికి ఏవి కావాలో తదనుసారంగా ఎన్నుకోవాలి. చెరుకు గెడలు, ఆకులతో సహితం ఉన్న అరటి మ్రాకులు అలంకరించిన పందిరిలో వాగర్థ సంపృక్తతారూప దేవతను ప్రతిష్ఠించాలి. అంగన్యాస కరన్యాసాదులతో ఆ దేవతను తనపై ఆవాహన చేసుకోవాలి. నువ్వే నేను నేనే నువ్వు అనే తాదాత్మ్య భావనతో జపించాలి తపించాలి. అప్పుడు ఉపాస్య ఉపాసక భేదం తొలగి పోయి దేవతారాధనా ఫలసిద్ధి కలుగుతుంది. ఇక్కడ చెరుకుగెడలపందిరి ఛందస్సు, శబ్దార్థాలు గంధమాల్యాదులు. ప్రతిష్ఠిత దేవత కవిత్వము. ఇంత చేస్తేనే తెలుగు పద్యసారస్వతంలో ఉన్న "తత్సరసాకార ముదార మన్మథ కళా సర్వస్వ శృంగారమున్" అన్నట్లు శృంగార సర్వస్వ స్వరూప, కేవల రమణీయతా మూర్తి అయిన కవిత్వరసాస్వాదనాసిద్ధి కలుగుతుంది. అలా కాక "విరసాంతః కరణుండవై" కాఫీ సిగరెట్లు సేవిస్తూ, కాకీ ఖండం మీద కాలు మోపి నిల్చుని, 'సామాజిక చైతన్యము' 'సమకాలీన సాహిత్యము' అంటూ తనకే అవిదితములైన కర్కశ తర్క శస్త్రాలు ఝుళిపిస్తే ఆ రమణీయతా దేవత ఎలా అభిముఖ మవుతుంది? ఎలా సుప్రసన్నమవుతుంది? ఇక ఎలా వరదాయిని అవుతుంది ?

ధన్యుడు శ్రీ శరభయ్య, పద్యం ఇంకా రాస్తూ ఉండే భాగ్యం ఆయనకు కలిగింది. బ్రతికే ఉన్న తెలుగు పద్యాన్ని చచ్చిందంటున్నారు. చచ్చేదే అయితే ఇరవయ్యో శతాబ్దంలోనే ఎందుకు చావాలి? 11వ శతాబ్దంలో బయల్దేరిన పద్యం నేటివరకు నడిచిన 10 వందల సంవత్సరాల కాలం చావడానికి చాలినంత కాలం! వర్తమాన దృశ్యం చూస్తే పద్యం చచ్చిందనిపించక పోవడమేగాక చస్తుందని కూడా అనిపించదు. ఈ విషయాన్ని అజ్ఞాన తిమిరంలో ఉన్న తెలుగు కూపస్థులకు పరిమితం చెయ్యకుండా, ప్రపంచ కవిత్వ చిత్రం చూస్తే విదితమయ్యే విషయం గ్రహించాలి. వచన కవిత్వం

రాయొద్దనడం లేదు. అది కూడా నిరాఘాటంగా రాయబడాలి. దానిలో నూ ఎన్నో మహిమలున్నాయి. కానీ పద్యం చచ్చిందనడం మాత్రం అవిచార మూలకం. రాబర్ట్ షార్ట్ అనే విమర్శకుడు 'Modernism' అనే పుస్తకంలో "డాడాయిజం అండ్ సర్రియలిజం " అనే వ్యాసం రాస్తూ అందులో "Modern poetry has placed a great weight on conscious craftsmanship; Beaudelaire derived this from Poem and transmitted it to Mallarme and Valery"-

"Modernism" అనే అదే పుస్తకంలో క్లయివ్ స్కాట్ తన "దిప్రోజ్ పొయం ఎండ్ ఫ్రీవర్స్" అనే వ్యాసంలో "Pound and Eliot did not tire of telling us that writing prose "(ప్రోజ్ అంటే ప్రోజ్ పొయం) is as demanding as writing verse, if not more " అన్నాడు.

ఈ మధ్య మన కొచ్చిన ఫ్రీవర్సుకు 19వ శతాబ్దంలో ఫ్రెంచి సింబలిస్టులు జన్మ నిచ్చారు ; ఆ కాలంలోనే స్వతంత్రంగా అమెరికాలో వాల్ట్‌విట్మన్ తన "లీవ్స్ ఆఫ్ గ్రాస్" అనే కావ్యాన్ని ఫ్రీవర్సులోనే రాశాడు ! కానీ ఈ 19 వ శతాబ్దపు ఫ్రీవర్స్, ఇంగ్లండులో షేక్స్పియర్‌కు పూర్వమే హెన్రీ హోవర్డ్ అనే కవి రోమన్‌మహాకవి వర్జిల్ రచిత ఇలియడ్‌ను ఆంగ్లంలోకి అనువాదం చెయ్యడానికి సృష్టించాడు. దాని పేరు 'బ్లాంక్ వర్సు'. ఈ బ్లాంక్ వర్స్ లోనే షేక్స్పియర్ తన నాటకాలు రాశాడు ! మిల్టన్ తన ప్యారడైజ్ లాస్ట్ రాశాడు. వర్డ్స్ వర్తు రాశిన "ది ప్రిలూడ్" టెన్నిసన్ రాశిన "ఇడిల్స్ ఆఫ్ ది కింగ్" బ్లాంక్ వర్సులోనే ఉన్నాయి. ఫ్రెంచి కవి పాల్‌క్లాడెల్ ఫ్రెంచి ఫ్రీవర్సే ఇంగ్లీషు బ్లాంక్ వర్స్ అని చెప్పాడు. బ్లాంక్ వర్స్‌కు పూర్వం మన మార్గఛ్ఛందస్సుల్లాంటివి పాశ్చాత్య దేశాల్లో ఉండేవి – అలెగ్జాండ్రీన్, ట్రొకేయిక్ – టెట్రామీటర్, అనా పీస్టిక్ టెట్రా మీటర్ ఇత్యాదులు. గణాల్ని వాళ్ళు 'ఫీట్' అంటారు. అయాంబ్, ట్రొకీ, అనాపెస్ట్, డ్యాక్‌టైల్ ఇత్యాలు వాటి పేర్లు. కనక గణఛ్ఛందస్సులు ఆ దేశాల్లో 16వ శతాబ్దానికి పూర్వమే పోయాయి. మళ్ళీ 18 శతాబ్దంలో వాటిని అవలంబించిన అలెగ్జాండర్ పోప్ లాంటి కవుల్ని విమర్శకులు నియోక్లాసిస్ట్స్

అన్నారు. కనక ఇక్కడ ఈ మధ్య మనం ఆధునికత పేరుతో కవిత్వంలో చేస్తున్న కుస్తీలు అక్కడ చేశి పారవేయబడినవి. బోదిలేర్ రాశిన "పెటిట్స్ పొయమ్స్ ఇన్ ప్రోజ్" అనే వచనరూపంలో ఉన్న కవితల మూలంగా పాశ్చాత్యకవిత ఫ్రీవర్సును కూడా విడిచి వచన రూపం ధరించింది. ఫ్రీవర్సు ఛందోబద్ధ పాదాల్లా కనిపించే లైన్లుగా విరిచి రాయబడితే, వచన కవిత అలా లైన్లుగా విరవబడకుండా లైన్ల సముదాయాల రూపంలో ఉంటుంది. కానీ కవిత కరుణాత్మకత లేక సంవేదన శీలత ఉన్న ఒక విలక్షణ అనుభూతి లోనుంచే పుడుతుంది గనక, దాని రచన సాధారణ శబ్దాల్లో వాక్యాల్లో ఉండక, అప్రయత్నంగానే ఒక విలక్షణ శబ్ద విన్యాసమున్న పంక్తిగానే అభివ్యక్త మవుతుంది. అట్టి రచనలో ఆ విశిష్ట సన్నివేశ బలంచేత ఆ పంక్తుల గమనంలో ఒక కళాత్మక శబ్దరచనాకేళి ఉంటుంది. దీన్ని అక్కడ విమర్శకులు 'కేడెన్స్' అన్నారు. ప్రాచీనచ్ఛందస్సుల్లో గణబద్ధలయ ఉండగా, ఫ్రీవర్సులో స్వచ్ఛందలయ ఉంది. ఈ విధంగా పాశ్చాత్య కవిత ప్రాచీనచ్ఛందాన్ని త్యజించి ఫ్రీవర్సును అవలంబించి, దాన్ని కూడా విడిచి కేవల వచన రూపాన్ని ఆలింగన చేసుకున్నప్పటికీ, కవితకు సహజాత అంగాలుగా ఉండే లయాత్మకత, రాగాత్మకత కవితను ఏదశలోనూ విడవలేదన్న మాట. కనకనే క్లయివ్ స్కాట్ అనే విమర్శకుడు తన "ది ప్రోజ్ పొయెం అండ్ ఫ్రీవర్స్" అనే వ్యాసంలో ( "Modernism" an anthology of Essays edited by Malcolm Bradbury and James Mac Farlance, 1987 Edition) "Measure defines the quantity and quality of beats; cadence is properly the spirit, the soul that must be added" అన్నాడు. సర్రియలిస్టులైన ఆంద్రే బ్రెతో, పాల్ ఎలార్డ్, అక్టేవియో పాజ్, జాక్ ప్రివేర్, మరియు డైలాన్ థామస్ ఇత్యాది ప్రసిద్ధ కవులు ఫ్రీవర్సు లోనూ వచన రూపంలోనూ కవితలు రాశినవాళ్ళే. కానీ వీరందరిలోనూ కేడెన్స్ అనే విలక్షణ శబ్ద విన్యాస కేళి అనివార్యంగా ఉంది. జాక్ ప్రివేర్ రాశిన వచన కవితల్ని సంగీతబద్ధంచేశి పాడుతారు. మన సంస్కృత చంపువుల్లోనూ గద్యకావ్యాల్లోనూ తెలుగు ప్రబంధ గద్యల్లోనూ మనకు కేడెన్సు స్పష్టంగా కనిపిస్తుంది.

కవితకు అలంకారం గుండె అయితే కేడెన్స్ దాని స్పందన. ఆలంకారిక భాష కేడెన్స్ సహితంగానే పుడు తుంది. ఈ కేడేన్స్ ఛందస్సుకు ఆత్మ అనేది స్పష్టం. కనక పద్యం చచ్చిందన్నా సరే, పద్యం తన ఆత్మను ఏదో రూపంలో నిలుపు కుంటోంది గనక, అది అజరామరమనే చెప్పాలి. పద్యం "ప్రజలకు" అర్థంకావడం లేదు గనక చచ్చిందనే చెప్పాలి అన్నట్లయితే పద్యేతరరూపకవితలు కూడా ఆ "ప్రజల"కు అర్థం కావడం లేదనేది లోకానుభవసిద్ధం. ఇక్కడే కాదు లోకమంతటా ఇలాగే ఉంది కవిత్వ స్థితి. అందుచేతనే గ్రేహం హగ్ అనే ఒక గొప్ప విమర్శకుడు తన "మాడర్నిస్ట్ లిరిక్" అనే వ్యాసంలో ("Modemism") "It was Shelly who said that poets are the unacknowledged legislators of the world; however, it would not have been necessary to say this if it had been obviously true. Such exalted claims are likely to be made just when they are becoming difficult to sustain and it is in the generation after the Romantics that the retreat of poetry from its public role first, becomes evident'.

ఫలితార్థంగా ఇంత "హృదయగ్రాహి" పద్యాలను ఇంత భయంకర కాలంలో కూడా మనకు ఇచ్చిన శ్రీ శరభయ్యను ఎంతగా హృదయానికి హత్తుకోవాలో మాటల్లో చెప్పలేను.

జ్ఞాన్ బాగ్ ప్యాలెస్
హైదరాబాదు – 500 012

గుంటూరు శేషేంద్ర శర్మ
11–12–1993

# సుప్త దీర్ఘిక

## (పద్యకావ్య మంజరి)

మల్లంపల్లి శరభయ్య

చైతన్య కవితా వేదిక
ఆర్ 2, జ్ఞాన భారతి
బెంగుళూరు 560 056.

కవిత 21

## త్రయీ జనని

ఓంకా రామ్రలతా సుమంబవయి నీవున్నావు మందస్మితా
లంకారమ్ము వెలుంగ మాధుకర మాలా నీల నీలమ్మునై
వంకల్ దేరి లలాట వీధి నటియింపన్ ముంగురుల్ వల్లకీ
టంకారమ్మొనరించునిన్ను మది నుట్టంకింతు త్రయ్యంబికా!

శ్రీ వాణీ కరధూత చామరశిఖా శీతానిలా నీత సం
సేవా సంవలితాలకమ్ము హసిత శ్రీ లాసికా లాస్య వీ
థీ విద్యోతి నవారుణాధరము చింతింతున్ సహస్రార ప
ద్మావాసమ్మయి వెల్గు నీయమృత దేహజ్యోతి త్రయ్యంబికా!

అమల చకోర బాంధవ కలాశ్రిత మూర్ధము,లాత్తమందహా
స మసృణ విద్రుమాధర విచాలిన భృంగములన్ విచిత్ర వ
ర్ణములు వినీలకాంత నయనాంచలసారి కృపామరంద ము
గ్ధములు గదమ్మ! నీ మొగముదమ్ములు వేదవనీ వనప్రియా!

నానా భూషణ బింబరాజి దధరాలంకార మందస్మితాం
వేదోద్యానవనీ విహార రసికాం విశ్వాంతరోల్లాసినీమ్
వీణావాదన తత్పరాం శ్రుతి శిరోవిన్యస్త పాదాంబుజాం
వందే త్వాం కరుణాసుధాలవకిరన్నేత్రాంచలాం మాతరమ్.

(1941)

## జూట శశి

సాంద్రతమః ప్రమర్శన కృశద్యుతి లక్షితవైన మన్మన
శ్చంద్రిక! యీ 'అమాస' తత్తై బలిసెన్ దెసలంచులందు; ధి
న్నేంద్ర మణిప్రగాఢరుచి; నేగవె! మాటుమణింగిపోవ, నీ
దంద్ర గిరీశ 'జూట శశి' రాల్చిన చల్లని పిల్ల వెన్నెలన్.

(1942)

# సింహ వాహన

ఈ యధర్మోద్ధతి నినమండలము దీప్తి
తరిగి చీకటిచాలు పరిచె దెసల
నేతన్మహాంధకారాతతమై విశ్వ
మల్లాడి యెలుగెత్తి యులమటించె
జాతవేదశ్శిఖా సందోహములు మింటి
కెగసి యుడుద్యుతుల్ పొగ మునింగె
సురలి పాథోభర్త యుద్ధత వీచి హ
స్తములు వేవేల్ వసుంధరను బొట్టె
ఈ మహాభూత నివహంబు, లేచి—యొక్క
పరిగ దొరకొనెనేమొ విశ్వప్రళయము
సేయు! నిదియేమి హేతువో! ఈ యకాల
విలయమేతెంచి డిందు నిట్టుల జగంబు.

ఈ భూత విప్లవంబేచి మాడ్చిన విష్టపము
లెల్ల ముక్తకంఠముగ దిశలు
పగులంగ రేబవళ్లుగ నశ్రుజలములు
దొరగి నిర్ఝరములై వరదలెత్త
విలపింప విలపింప విశ్వాంతరాళ
వాసిని దుర్గ సింహవాహన యెడంద
కరిగి యేసుండగ దురపిల్ల బనియేమి
యనుచు మూర్తిత్రయాస్యాంతరాళ
ములను వెలువడె గన్నుదమ్ములకు దుర్ని
రీక్ష్యము దురూహ మఖిలరాత్రించరౌఘ
మర్దనాభీల ముద్దామ మహిష దితిజ
కంఠ లుంటాక హేవాక గాఢ దీప్తి.

విశ్వాంతరాళ వాసిని
విశ్వేశ్వరి విశ్వరూప విశ్రుత మృగరా
జాశ్వ కరాళాకృతి వి
శ్వశ్రేయసము గోరి చనుదెంచె నహో!

అది యెన్నండు పురామహర్షినివహం బాత్మానుసంధాన సం
పద వీక్షింపగరాని యొండొక మణిప్రాసాద గర్భాంతరా
స్పదమై విశ్వమునిండి వెల్గెడు మహస్సంతాన ముగ్రాహవో
న్మదర నక్తంచ మర్దనోద్ధత పదన్యాసంబు తోతెంచెడిన్.

క్షిప్రాస్వాదిత ఘోర రాక్షస చమూచ్ఛిన్నాంగ నిర్యన్మహో
స్ర ప్రస్రోతస, ముద్ధృతాయుధము, ఘోరాకార రక్షః కపా
ల ప్రాలంబము, భీషణాస్యము, కరాళాలోల జిహ్వాలతా
దీప్రం, బుద్ధత తాండవోద్యతము తోతెంచెన్ సమిద్వీథికిన్.

ఉదయ సంధ్యారోచిరుద్గమంబున బోలె
దెస లెల్లనై చూడ్కి మసలి చెదర
హరినీల దీధితు లల్లికలై ప్రవా
హములు కట్టిన లీల దమము పర్వ,
శరదభిరామ పాండుర చంద్రికా పూర
మురవడి సురువులు విరిసినటులు
ధవళ కాంతులు పర్వ, దవహుతాశన శిఖా
సమధికోగ్రప్రభ లమరవెడలె
నామె పర్యాయ లబ్ధ సంధ్యా నిశీథి
నీ శరజ్జ్యోత్స్నికాతప నియతమూర్తి
యైన కాలంబు తానప్పు డఖిల దనుజ
లయ సమాయాత కాళరాత్రియె యనంగ.

ఒక్క కలస్వనం బుదయించినది మరుత్
పథ మధ్యమున నది బహువిధ
ప్రచార మనోజ్ఞమై పారాడి దిక్కుహ
రాంగణమ్ముల ననురణితమైన
యాసవ్వడులు దూరమందున బోలె డ
గ్గఱవోలె గలయు నల్గడల బోలె
వినవచ్చినవి శబ్దగుణ మంబరంబున
బరవశ నృత్యవిభ్రమ లొలసి
నెరపినటులన్ సహస్రార నీరజాంత
రావ భాసిత కర్ణికాభ్యంతరాళ
కేసర మనోజ్ఞ పరిధి నావాసమైన
శ్రీ సుధామయమూర్తి వేంచేయు నపుడు.

బంధుజీవాశోక పద్మరాగోపమ
    నరుణారుణచ్ఛాయ లడరి పుడమి
చెఱగులు నాలుగు, చెందొవ దండల
    యింపున గంధమ్ము లెలమి గురిసి
అర్చోపయోగిత నందియున్నవి వోలె
    గడు ప్రసన్నములైన గతి దలిర్చె
జిర సమాధి స్థిర వరమౌని హృదయారవింద
    జాగ్రన్మధుస్యంద మమల
చంద్రహాసోజ్జ్వల ప్రభాస్తబకితంబు,
నరుణ వాసోవసానంబు,నరుణమాల్య
మరుణ నయనాభిరామంబునైన మహము
నాహవోద్ధతి దరలిరానైన యపుడు.

అరుదార నద్దేవి యురుదేరు వేళలో
    నఖిల భూతంబులు సంతరముల
దళిత శోకములయ్యె దనుజ సంప్లావిత
    ధర్మాత్యయగ్లాని తలగినంత
నురలిన జలరాసు లొరలె వేలలకు నంత
    ర్ఘూర్ణనమున సతార నభము
విలసిల్లె నిర్ధూమ విమలతరాలోక
    మున సుధాంశునియందు వనములందు
నదుల యందు నానా జంతు హృదయముల, న
సీమ మగుచుమ మఱియు నచింత్యహేతు
వయిన సమ్మోదరస, మొం,డనార్తవంబు
నెరయ నంతకు నంతలై నిట్టవొడిచె.

సప్తర్షి మండల చరిత స్వరాపగా
    పాథఃపృషత్ పుణ్య పరిచయములు
దివ్యర్షి పరిషదుద్దిష్ట పూజా, శత
    పత్రమాలాగంధ పరివహములు
నన్యోన్య మార్గాంతరాంతర పరిలీయ
    మాన కిన్నరగాన మధురిమములు
నంతర్బహిస్సంగతానంత చైతన్య
    వాసనాపరిగత బ్రహ్మములును
నధిక సుషమాభిరామంబు లయ్యె నపుడు

శాంతపావన వాయు ప్రచారములను
గంధవాహోద్వములు నేడు కలిత విశ్వ
కరుణమౌనొక్క వెల్గు రాకడల లోన.

(1943–45)

## జలధి శీకరము

కలదు కనువిప్ప దొల్లి నే కలశ జలధి
యాకసము నంటి మన్నయనాగ్రసీమ
కాలమట లేదు దిగ్విభాగంబు లేదు
జలధి గర్భోత్థిత పయస్తుషార మేను.

తెరలి యిట వచ్చి పడతి రాత్రిం దివావి
రత మహాయాత్ర నీ, దిగావృత ధరిత్రి
మలగి నాస్మృతి యిందు నే మన్న బ్రదుకు
నిరవధిక దుఃఖయాతనాభరిత మయ్యె.

ఆ సుధాసింధు శిశిర గర్భాంతరమున
కెన్నడో నా పునర్యాన మెఱుక పడదు
ఇచ్చట వేగింతు నాప్రొద్దు లెద గరంప
జలధి వేలానిలోదిత స్వాదుగీతి.

(1946)

## ధ్యాన దేహళి

నిరవధి వియద్విహారేచ్ఛ నీడ భూమి
వేగియుంటి పక్షోద్గమ వేళ దనుక
అలసి నేడు లోకాలోక యాత్ర మఱలి
మత్కులాయాంత నిద్రాసమాధి వలతు.

వితత మోహ తంద్రాభరానతము లిపుడు
నా గరుద్రేఖ; లొరసె ననంత గగన
జలధి భూధర కానన శ్యామరేఖ,
లలస పవనాహత స్వన దంచలముల.

శ్రమ నిమీలిత లోచన సరణి నిరులు
గవిసి క్రమశో విలుప్తము లవియె! మత్ప్ర
చార వలయాంక భూషితాశా దశాంత
రాళ మాలోక పూర్ణవేలా పయోధి.

సరవి నిట్టి యాతాయాత పరిధుల బడి
శ్రమ విలులితము ప్రతి దివస పరిణామ
వేళ నీ నీడ దేహళి వ్రాలు నాదు
ప్రాణ, ముచ్ఛ్వసిత పురాణ పత్రమటుల.

బంధుర సుషుప్తి యోగ నిష్పందవృత్తి
నూని నేడిదె గళిత దివానిశా వి
మోహమతి నొచు నాలోక పూర్ణపథము
లంటి చనియెద ననివర్తనాయతనము.

(1952)

## సుప్త దీర్ఘిక

కొల, నిమ్మోయి; కరణములను
అలుగుల తెరువడిచి యేననాదిమ నిద్రా
జలముల నంచులు మోవగ
నిలువు నిలువు దాక లోన నింపితి దీనిన్.

కొల నిమ్మోయి; కరణములను
నలగుల తెరువడిచి యే ననాదిమ నిద్రా
జలముల నంచులు మోవగ
నిలువు నిలువు దాక లోన నింపితి దీనిన్

వివృత కరణ సరణి శివ ! జగత్ప్రీత్యయ
మలిన వారి నిగిడి కలగునేమొ
కొలను; విమల కమల కుముద కంఠ ప్ర
తానాభిరామ జఠర మని తలంచి.

చిర తమో జలౌఘ శిశిర తమస్పర్శ
మునిగి యణగె కరణముల తమంత
ఈద తాకి గూటి యెద పులుంగుల వోలె
నెగయు రాక తెలివి యెల్ల లందు.

అలవి యగునె నాకు నస్వప్నమౌ నిద్ర!
విరియునొక్కొ కమల వీథి యిందు!
లయవిధాయి రయచలత్ జలభ్రములందు
వివృత వక్త్రి నక్ర విహృతు లందు.

అరిగి యరిగి లోని కబ్జనాళాంతర
విమల గర్భ శయ్య విశ్రమింతు
అలమి యచట నన్ను నస్వప్నమౌనిద్ర
విరియుగాక కమల విసిన మిందు.

(1958)

## పితృతిథి

లిపి సమభ్యాస దినముల యపుడు నేను
దిద్దుకొన, కమ్మ నెంతొ వేధించినాను
చెప్పవమ్మ! సముద్రమ్ము చెఱువు కన్న
చిన్నదా? పెద్దదా? నాకు చెప్పమనుచు

చిన్ని నాకేలు మీకనిష్ఠిక నమర్చి
నన్ను గొని చూపితిరి నాడు మిన్ను లొరయు
నల మహోజలరాశి యనంత మనుచు
విరియు పసికన్నులందు నచ్చెరువునిండ.

కావ్యశిక్షాదినమ్ములు గడచి నిరత
భావనా వశ హృదయ విపచ్యమాన
వాసనా దుగ్ధ పరవశ భావ మొందు
తరిని 'మఱువకు'మని చెప్పి తరలినారు—

గళిత సాధన పథమై ప్రగాఢ మోహ
వివశమై తండ్రి! మీ పర్యవేక్షణమ్ము
తప్పి దెసమాలు మజ్జీవితమ్మునందు
చెలగి యొకనాడు మిము దలంచినది లేదు.

నే డమావాస్య—మున్నీటి నీట గలుప
వచ్చినాడను పితృభుక్త భాజనముల
కబళిత నభః కటాహాంధకార విలయ
జలధి! మీ కోపమరసి విహ్వలుడనైతి.

(1955)

## ప్రతీప గతి

పలుకుల దలంపులను నడపడిని 'నాకు'
నభిముఖముకాని యీ నా ప్రయాణమందు
యంత్రశిక్షానిరుద్ధ దుష్టాశ్వలీల
నీడ్చుచున్నవి నన్ను రేయియును బవలు.

నిర్జిత స్వార్థధూర్ధామ నేమి మృత్యు
ఘోషమున గుండియల్ కలగుండుపడ, న
తోన్నతాధ్వమ్ములందు వైద్యుత జవాతి
నీయ మానమ్ము రథ మస్మదీయ తనువు.

జలధి పారమ్మునకొ! నభ శ్చరమసీమ
కో! నిరంత మరుస్థలికో! మదీయ
దేహరథ మీడ్చుచుండె రాత్రిందివములు
భయద రయధోరణీ పరస్పర జిగీష.

అనధిగత గమ్య, మీ నా ప్రయాణమందు
కలదు పర్యుత్సుకత కొంత, కలదు దుఃఖ
జడతయు; నతీత రమ్య విస్తార విషయ
కల్పిత క్షణిక స్నేహ కాతరమున.

స్థపుటి తాధ్వం, బయంత్రితాశ్వములు, విప్ర
తీప గతి; యీ రథంబు నేతీరమునకు
దేరనున్నవొ! యన్న యుద్వేగమేల?
అది యెచటనిల్చె శాంతి నిశాంత మచట.

(1956)

## చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

దిగ్దంతి సాంద్ర మదగంధ విహాసికీర్తి
శ్రీ చందనేవ సమలంకృత దివ్యదేహమ్
భాషావతార మఖిలావనిపాల మౌళి
సంసేవ్యమాన పద పంకజ మానతోస్మి.

అనయంబున్ భవదీయ దివ్య కవితావ్యాహార మాహారమై
తనరన్ తావక ధర్శనార్థ మహిరాట్తల్పంబుపై మేను వా
ల్చిన శ్రీనాథుని కోస మా ధ్రువుని వోలెన్ దేవ! యిన్నాళ్లు నా
యొనరింపంబడు భావనాతపము లోహో! పండె నీ రాకచేన్.

ఎవియో కాని యెఱుంగరానివి కదే! యీ నన్ను గారించు భాం
ధవముల్ తొల్లిటి జన్మలోని వనుచున్ తర్కింతు నో స్వామి! నే
డవితర్క్యమ్ముగ దర్శనంబిడితి వాహో! పండె భాగ్యంబు కం
దావ కత్యంత సుఖైక ధర్శనుడ వాదోకావొ! యంచెంచితిన్.

(1942)

## సౌందరనందము

తేనెలువాఱు వాకలయి తీయని షట్పద గీతికా మధు
శ్రీనివహమ్ముగనట్లె విలసిల్లెడు సౌందరనంద మాధవో
ద్యాన రసాల పల్లవ రసాతికషాయిత కంఠ కోకిలా
నూన కృతజ్ఞతా మృదు మనోహరగీతిక లాలకింపుమా!

(1941)

## కాటూరి వేంకటేశ్వరరావుగారు

ఆరంబోసిన పండువెన్నెలలు నీహారాంబువుల్ మేల్కొబం
గారమ్ముగన్ దొవతేకు మెత్తనలు ముక్తాహారముల్ సాంద్ర క
కర్పూర క్షోదము గర్భకైతక దళంబుల్ కార్తికీ శాలి కే
దారశ్రేణులు రూపుగొన్న కవితా తన్వంగికిన్ భద్రమే!

భద్రమే! సుందరీనంద భావపరిధి
వెలుగు ప్రణయార్చి చిదిమి దిగ్వలయ తమము
లొత్తిగిల మణిదీపిక లెత్తు మీ ఫ
లానుమితమైన సుమహి తారంభమునకు.

పౌలస్త్య దుఃఖ బాడబ
మాలాకీలార్చి నెడద మన్నించిన యీ
తాలిమికి నాటుపోటులు
వేలాతిక్రమము లేని విధ మచ్చెరువౌ.

అనవరత కావ్యశీలన
జనితోత్కలికాసహోతి చంచల మతినై
నిను వెదకికొనుచు నేనొక
దినాంత మం దరుగుదెంచితిన్ బసినాటన్.

నీ యనుభావ మదెట్టిదొ
మాయురె! నినుగన్న పూర్వ మహితాంధ్ర కవీ
శాయత తేజస్సన్నిధి
యై, యెద మ్రాన్పడి వినమ్రతాయత్తము కాన్.

నీ కడకంట నివ్వటిలు నెయ్యము తియ్యన, నాడు మున్నుగా
నా కనుభూతమై దినదినంబునకున్ దఱితీపు లొచు మృ
ద్వీక ఝరంబుగా నిగిడి, వేల్పులవాగయి మేరకందమిన్
శీకరవృష్టిచే బరవశించుట మాత్రమ, యే నెఱుంగుదున్.

నను గైకొన్న కృపావిశేషమునకున్ నానా కవీశాన కా
వ్య నిలీన ప్రతిభామయ ప్రకటరూప ప్రాపితోదార ద
ర్శన భాగ్యంబునకున్ హితత్వమునకున్ స్వాదుప్రియాలాప వ
ర్తనకున్ దైశికభావ సంపదకు డెందంబందు కై మోడ్చెదన్.

(1957)

## విశ్వనాథ సత్యనారాయణగారు

పాతాళాంతర గర్భ నిర్భర తమఃప్రాగ్భార నిర్భేదియై
జ్యోతిస్స్ఫూర్తి వహో! మహోఃకబళిత వ్యోమాఖిలాశాంతమై
యేతేరన్ బరిషత్తు తీర్పబడె బ్రాహ్మీభావనుల్ రారయా!
గౌతమ్యాపగతీర ధారణికి వాక్సత్రామృతాన్నార్థులై.

ఇంధానాక్షి నొసంట డాచు సహిమంజీరంబు, ఛన్నేందు సం
బంధ జ్యోతి రుదారమౌళి, గళసీమారుద్ధ భాషాపయో
మంథాన ప్రభవాగ్ని, దైవత జగన్మాహాపయుస్స్వాదు గీ
స్సింధూత్తంభిత కల్పవృక్ష సుకవి శ్రీకంఠ తేజం బహో!

ఉదితైణాంక మనోజ్ఞ మౌళితలమై యోషాపుమాకారముల్
కదలన్ మాటికి గచ్ఛపీ మధుర నిక్వాణంబొ! మౌర్వీలతా
ధ్వ్యుదితోంకార నిరంతర శ్రుతియొ! సమ్యూర్మకేంద్రియ గ్రామమై
మదియెల్లన్ శివశారదాద్వయ మహో మగ్నస్థితిన్ ప్రాప్పడెన్.

నతులర్పింతు పురాణ జిహ్మాగ ఫణాంతః ప్రత్న రత్నాగ్ర దీ
ధితి కిమ్మీరిత సాధువర్ణ పదవీథీ ప్రౌఢశయ్యా పరి
ష్కృతి సంభార ధురావిరాణ్మయ మహఃశ్రీ విశ్వనాథోగ్రధీ
కృత రామాయణ సత్యవాఙ్మధుర సాహిత్యేందిరా స్వామికిన్.

జయజయ! పూర్వ మహాంధ్ర కవీంద్ర వచఃక్రమ చంక్రమ సాధుకృతీ!
జయజయ! వేదశిరః ప్రతిపాదిత సార మహార్థ నిరూఢ మతీ!
జయజయ! రూక్ష నిటాలతటీ నట శైవమహః పరివేష ధృతీ!
జయజయ! సర్వదిగంత మహా పరిషత్పరిపూర్ణ మహః ప్రసృతీ!

(1960)

## భద్రకాళీశ్వరా !

నీపేరన్ బ్రభవించె దమ్ముడితడున్, నీ వింటివేల్పాదువన్
ప్రాపై నీవు కులాన మాకు నెగడున్ పారంపరీ భద్రముల్
మాపాలన్ దురితంబు లెన్ని కలవో ! మద్వంశదైవంబ ! నీ
వే పాలింప దలంపవేని గతియేదీ ? భద్రకాళీశ్వరా !

అన్నల్ నల్వురు తమ్ముడీయొకడు వీడన్నన్ బహిఃప్రాణమా
త్మన్నామాంకము ! తన్నిమిత్త మనుబద్ధప్రీతియో ! నే నెఱుం
గన్, నాయందున నన్న లిట్టిరె సుమీ! కారుణ్యవారాశి! నీ
పన్నాళీక సమాశ్రితంబు కులమప్పా! భద్రకాళీశ్వరా!

నీ వింట న్నడయాడు నాళ్ళెఱుగనే ? నిత్య ప్రసన్నుండవై
సేవాహ్వానము విన్నయంత జననీ సీమంత ధూమోద్గమం
బై వీరాసన సన్నివిష్టమగు వ్యోమాంగంబు, ఖడ్గంబు, మద్
భావారూఢములయ్యె ! యెన్నటికి భద్రా ! భద్రకాళీశ్వరా!

కృతి నిర్మింప దలంప; నేటికి త్రయస్త్రింశాబ్దమున్ దాటి, సన్
మతి భావింప దలంప, భక్తజనతా మందారమున్ నిన్ను, నా
బ్రతుకిట్లై జపియింపనొల్లనుజామీ పంచాక్షరంబైన, సద్
గతి దవ్వెంతదయా ! దయాగుణసముద్రా ! భద్రకాళీశ్వరా!

జనకుండీయనిదేమి? వంశమొ సదాచారంబొ మంత్రంబొ ప్రా
క్తన నిష్ఠానియమంబులో ! శివపదధ్యానైకతానాత్మయో!
వినుతింపన్ దలపైన, నిన్ను కవితావేశంబు నన్నొందదే
ని – ననుంజెందిన మత్పురాఘమిది తండ్రీ! భద్రకాళీశ్వరా!

ప్రాయంబో ! సగమాయెనింతకు, భవత్ పాదారవిందార్చనల్
సేయంబో నొకనాటికేనియు, భవచ్చింతాదరిద్రంబుగా
నాయెంబోమది నాయనుంగు, వెడగ్గైయల్లాడ నీపేరటన్
న్యాయంబో ! కులదైవతంబవయి భద్రా ! భద్రకాళీశ్వరా !

పాటాడన్ గృహ దేహళీతతి, శిశువ్యాజంబునన్ నిన్ను నా
గారామంటినొ? దోరుదగ్రధృత ఖడ్గస్ఫారధారా! క్రతు
క్ష్మారంహఃకృతతాండవోచ్చలిత ! సాక్షాద్వీర భద్రావతా
రా! రారయ్యరా ! యంటినో ? తలపు భద్రా! భద్రకాళీశ్వరా !

చూళీబద్ధ జటాకుడుంగ నివసచ్ఛాలీ! కనద్ఘోర దం
ష్ట్రాళీ! సర్వ జగజ్జయోన్నత భుజావ్యాళీ! ప్రధావన్మరుత్
పాళీ! నిర్వమదగ్నిదృగ్ భుగభుగత్ ఫాలీ ! జ్వలజ్జ్వాల మా
లీ! లోకాద్భుత ఖడ్గచంక్రమణ కేళీ ! భద్రకాళీశ్వరా!

దురితారణ్య కుఠార ! దుర్జన మనోదూర స్థితాచార! సం
సరణాంభోనిధి పార! దారుణ విపన్మగ్నాశ్రితోత్తార! శ్రీ
చరణాంభోజ విచార సార ధిషణా సంచార ! ధారామనో
హర వర్షాదిన నీల నీరధర ధీరాకార! కాళీశ్వరా!

శూలాసంగ! మహోత్తమాంగ విలసజ్జ్యోతిర్మహాలింగ! చిత్
లీలాకల్పిత యజ్ఞభంగ! జయఖేలత్తాండవాభంగ! స
చ్ఛీలోద్యచ్ఛ్రిత మందిరాంగణ సరచ్ఛ్రీమత్ కృపాపాంగ! శ్రీ
తాళక్షేత్ర కృతానుషంగ! హృదయాంతఃసంగ! కాళీశ్వరా!

శోణారీణసరస్వతీక్షరదసృక్శోణంబు, ధావజ్జగత్
ప్రాణప్రాణము, భక్తలోక ధృత సంత్రాణంబు, శుంభత్కృపా
ణం, బుజ్జ్వలకీర్తిశాణము, మఖశ్రీధ్వంసనోద్యద్గణ
శ్రేణీప్రాణము,నీకృపాణము శ్రితార్తిచ్ఛేది, కాళీశ్వరా!

శూరోత్తంసమ! వచ్చె గౌతమి గళచ్ఛోణాంబువేణీ పరి
ష్కారోదగ్ర మనోహరాకృతి, భవచ్ఛైలాంఘ్రి పీఠస్థలిన్
జేరన్,జెందిర కావి చెందెర! క్షరచ్ఛ్రీమత్ కృపాణాగ్ర ధా
రారక్తవ్యతిషంగపేశలత, భద్రా! భద్రకాళీశ్వరా!

పాకారి ప్రముఖాత్త హవ్యము, సతీప్రాప్తాగ్ని సాత్కారమున్
వ్యాకీర్ణక్షితి వచ్చి చెప్ప గణముల్ పత్నీ విదాహోన్మనః
శ్రీకంఠోగ్ర జటా నిటాలకలిత స్వేదోద్భవంబైన మీ
యాకారంబె శుభంబు మాకిడుత భద్రా! భద్రకాళీశ్వరా!

పరిదోవిద్యుదమోఘమేఘపరిషత్ ప్రాగ్భారదేహాయ, తే!
పరిమాణేతర హేతిదీధితి చలద్బాహా సహస్రాయ, తే!
కరుణాంభోనిధయే నమోస్తు శ్రితరక్షాగాఢదీక్షాముహు
స్త్వరమాణాయ నమోనమోస్తు భవతే భద్రాయ కాళీశ్వరా!

రుద్రాయామితేజసే నమ ఇదం రౌద్రావతారాయ, తే!
భద్రాయైవ నమోనమస్త్రిజగతీ భద్రాయతుభ్యం నమో
మద్రక్షాపరమాదరోదిత కృపామంజు ప్రభాతాగమో
న్నిద్రాంభోజదృశే నమఃశివ నమస్తే భద్రకాళీశ్వరా!

రౌద్రాకారత మమ్మలంప నిది మేరా! నీకు లోకత్రయీ
భద్రాకార! భవత్పదాబ్జయుగళీ ఫాలస్థలీ ముద్రలన్
మాద్రోహంబు తలంపకే! మఱువకే! మాతండ్రి! కారుణ్యరే
ఖాద్రాఘిష్ఠ నవారుణాంబుజ కటాక్షా! భద్రకాళీశ్వరా!

నిద్రాముద్రదొలంచిచూడు! విదళన్నీరేరుహాంతస్సుధా
ముద్రాభద్రము, నీ కనుంగొలకులన్ బొంగారు కారుణ్యమ
ద్రిద్రాఙ్నిర్యదభంగనిర్ఝర సమోద్వేగంబు వర్షించి కుం
భద్రోణంబుల, నోలలార్ప సద,నప్పా! భద్రకాళీశ్వరా!

భరమా! మాదృశ కింపచానకృత దుష్ప్రారబ్ధముల్ దూల్ప, న
ధ్వరవిధ్వంసనగాఢకేళికి ? శ్రితాంతస్తాపమున్ బాప, న
బ్బురమా! సర్వజగచ్ఛరణ్యశివహృత్ ప్లోషోరు తాపైన్ని
ర్ఘరణారంభ విజృంభ మాణునకు ? భద్రా! భద్రకాళీశ్వరా!

ఛలితస్వాంత శివాపరాధి మఖశిక్షావేశ మెంతయ్య? వి
హ్వలిత స్వాంత పదానురోధి శ్రితరక్షావేశమంతయ్య! యూ
ష్మలమెంతయ్య? శివేతరాధ్వగమఖక్ష్మావీథి, మాయయ్య! శీ
తల మంతయ్య! నిజాంతరంగమున భద్రా! భద్రకాళీశ్వరా!

ఒడయుండా! మదిలోన నీవు దయ నన్నోమంగ నూహించితే!
తడవేలయ్యర! యింతకంత బహిరంతర్ గ్రీష్మమై భీష్మమై
యెడరేచెన్ సుడిలేచె బ్రాణములలో, నేనుంటి నీకంటి మిం
ట, దయచ్చాతక రీతి వావిడి కృపార్ణఃపూర్ణ! కాళీశ్వరా!

సదయాంభఃకణ నిస్సరత్ స్మితకళా సౌదామనీ దీప్తితో
మద కుంభీంద్ర సమానయాన విచలన్మంజీర గర్జాళితో

ముదిరానీల మనోహరాపఘన! సమ్మోదంబుమై వచ్చి నా
హృదయక్షేత్ర నిదాఘ మార్పగదె! ప్రావృణ్మూర్తి! కాళీశ్వరా!

శింజానాంఘ్రితటీ లురర్చిద మంజీరాగ్ర ఘంటాధ్వనుల్
గుంజన్మంజుల బంభరార్భటి నెదుర్కో, మద్విపన్నీరభృత్
ఝుంఝూపవంధ్యరయప్రభంజన సరత్ ఝుంపాగతిన్, బాలనో
ద్యుంజానాకృతి వచ్చియేలు మనుకంపోనిద్ర! కాళీశ్వరా!

కాలాకార భవాంధకాఖ్య దితిజోగ్రగ్రాస లిప్సామిళత్
క్ష్వేళాభీల ముఖాంతరంబున భయోద్విగ్నైక భుగ్నస్థితిన్
కాలార్పన్ గయియార్ప జాలనుగదే! కారుణ్య లీలాతటిన్
మాలాసుస్థిరదీప్తి నావెఱయిరుల్ మాయించు! కాళీశ్వరా!

తాలోత్తాల విపత్తరంగ భయదోద్యజ్జన్మవారాశిలో
నోలాకుంబడి, వెల్లకింతలయి, మగ్నోన్మగ్నతన్ గాఢభీ
త్యాలీఢాఖిలచేతనుండనయి, మద్దైవంబ! ద్వీపంబుగా
నాలంబించితి నిన్ను, దవ్వు చనకయ్యా! భద్రకాళీశ్వరా!

శిక్షారుద్ర! జగల్లయాంతముల ద్వత్ క్ష్వేళాసముద్ఘాట్టహా
స్సక్షోభంబున బద్మజాండమవియున్ జాగ్రద్భవద్దోశ్చలత్
కౌక్షేయాగ్ర ధళంధళా చకితులై కన్నారయా! వేలుపుల్
త్ర్యక్షదోహఫలంబు జన్నమున భద్రా! భద్రకాళీశ్వరా!

రక్షాభద్రుడవై నిలంబడుమురా! రారా! క్రమక్ష్మానటత్
త్ర్యక్షాకార! విపక్ష పక్షము పరాస్తంబయ్యె దక్షాదిగా
స్సక్షస్కంధ నిషణ్ణులై శివులు నేడూరేగనున్నారు త్వత్
కౌక్షేయ ప్రతిబింబితాకృతులు భద్రా! భద్రకాళీశ్వరా!

అంసోల్లాసి మహాసిదీధితి వియద్వ్యాప్తంబుగా,మేఖలా
సంసత్సంకుల కింకిణీ కిణికిణీ స్వానాస్ఫుటాలాపయై
హంసీయానముతోడ గాళిక కదే! యాయమ్మ,మద్దైవతో
త్తంసంబుల్ కరుణింప వచ్చితిరె! భద్రా! భద్రకాళీశ్వరా!

స్వాహానాయకు నాల్క లంటదెగి, పూషాదిత్యు పండ్లూడి, త
న్నీహారద్యుతి కందిడింది, తెగి వాణీనాస,నెమ్మె, తురా
సాహుండోహటిలన్, నటింప గణముల్,సాహోనినాదార్భటిన్
"త్రాహి త్రాహి" ఘటింపవే విధికి? భద్రా! భద్రకాళీశ్వరా!

ధూతాస్మత్ కులవృద్ధ పుణ్యచరితాంధూబంధ,మంధేంద్రియ
వ్రాతారణ్యతృషావశానుసృతి, ధీరస్వైరయానంబు, ని
ద్రాతంద్రాళు, వపాస్తభక్తి, మదగంధవ్యాప్తదాశంబు , మ
చ్చేతోమత్తగజంబు లోగానవె! మాప్పిడాదు కాళీశ్వరా!

తమ మంతంతట గచ్చువిచ్చి, చిరనిద్రాముద్రితంబైన చి
త్తము తేకెత్త, నిరూఢ ధీజడిమ డిందన్,గందళింపన్ ప్రబో
ధము క్రొత్తావులయూవి,లోయెద మరందస్యంద మయ్యేన్ మహా
ప్రమథస్వామివి వేవెలుంగవుదె! భద్రా! భద్రకాళీశ్వరా!

నిలు మొక్కించుక నాహృదబ్జమున బన్నీరేరుహంబూది నిన్
జలకంబార్చెద లోచనాంబు వినిమజ్జజ్జాటిగా, భక్తి స
ర్వలు గూర్తున్, ధృతి వీరగంధ మృదుచర్చల్ దీర్చెదన్,ధ్యాన ని
ర్దళితాహంతయె నారికేళ, ముపహారంబిత్తు గాళీశ్వరా!

పదియేండ్లప్పటి కైతకైన బలికింపన్ జాలుదున్నిన్ను, ని
ర్వదియేండ్లప్పటి మాటకైన గరగింపన్ జాలనో! నేడు ము
ప్పదియై,లౌకిక వాసనా కలుషిత స్వాంతంబునై బిట్టు నా
పదయై నీకృపరామికై వగతునప్పా! భద్రకాళీశ్వరా!

మృడ! యుష్మత్పదనీరజస్మృతి కళాహీనంబులై వేకువల్
చెడె,బ్రాహ్మాంబు లడంగె, మాసెను దినశ్రీ, సంధ్యయున్ వంధ్యమై
నడచెన్, లోయెద గ్రమ్ముకున్నది భయాంధ్యం బెంతలో తెల్లవా
రెడు? నన్నెచ్చట నిద్రలేపెదవా! తండ్రీ! భద్రకాళీశ్వరా!

ప్రహరిన్ రండు గణంబులార! మతిధారా! శ్రీకృపాణీ! చతుః
ప్రహరంబుల్ నిలుమమ్మ! దీపకలికాభన్ భద్రకాళ్యంబతో

విహరింపన్ దయచేసి యుండెనట! శ్రీవీరాధివీరుండు, నా
దహరంబందున; భద్రమెల్లప్పుడు భద్రా! భద్రకాళీశ్వరా!

## కీ. శే. కాటూరి వేంకటేశ్వరరావుగారు

కడుపున బుట్టనన్నది యొకండు కొఱంతయెకాదు; నెమ్మదిన్
గొడుకుల మీదనైన దనకుంగల కూరిమి యెట్టిదో! వినం
బడదెపుడే; నదెల్ల శరభయ్య యెఱుంగు నొకండె; నేటికిన్
బడుగయినాడ, దాదృశ కృపామహితాత్ముని బాసి మద్గురున్.

ఏ సుకృతంబు నా యెడ ఫలించియొ నా పసినాటి వేకువన్
దేశిక భావమందున బ్రతిష్ఠితమైన వెలుంగు; ఆంధ్ర వా
ణీ సదనీకృతాననము నిల్చిన దిర్వదియేండ్లు, నేటి, కా,
నాసుకృతంబు దవ్వుచనెనా! మననా! యిక జోగినై ధరన్!

వింశత్యబ్దములేగె నిన్నుదొలుతన్ వీక్షించి, నాకుం ద్రయ
స్త్రింశాబ్దంబిపుడైన, నేరనుజుమీ! శిష్యత్వమో! సఖ్యమో!
భ్రంశంబయ్యె వయోవిభేదము భవద్భావామృతాంభోనిధిన్
బ్రాంశూదాత్తమనీష ! నే గనిన నిర్వాణం బనిర్వాచ్యమై.

నీతో నేర్చితి, నాంధ్రగీఃపికవధూనిర్హ్రాదముల్ స్వాదువుల్
నీతో వెన్నెరేల బండితి, హిమానీస్వచ్ఛలన్ శయ్యలన్
నీతోడన్ బడిరాను, స్వర్గపురికిన్ నీవేగి, తాంధ్రీ వచ
శ్శ్రోతోజాతుడ వచ్చుటన్ సురవచశ్శ్రీ, బాళిమైనున్నదో!

అనువర్తించితి శిష్యునిన్ నను, గురుండైయుండియున్నీవ; ని
న్ననువర్తింపన; శిష్యుడంగద! గురున్ హార్దైక వారాంనిధిన్
నను నోనాడి యెఱుంగవెన్న, డిచటన్మర్మంబు నీ నా యెఱిం
గిన, దెవ్వారి, కగమ్య, మాశుభమతిన్, గీర్తించెదన్ మద్గురూ!

నీ యనురాగ దివ్యమధునిర్భరశోభ దలిర్చియున్న నా
ప్రాయమునందు నామనియె రాదిక యెన్నటికిన్; దురంత తా

పాయితమౌనిదాఘమొ, జడాయితమౌ శిశిరంబొ,జీవిత
వ్యాయతియెల్ల పట్టి బయలై దిగులై నొగులై భరంపడెన్.

నీ చనుత్రోవ నిర్ఘరవనీ వ్రతతీ నిపతల్లతాంత ధా
రాచితమయ్యె సమ్మదభరస్నుత దివ్యగవీపయస్సుధా
సేచితమై ప్రహర్ష వివశీకృత దివ్యవనీ వనప్రియా
ళీ చిరరుద్ధకంఠకుహాళీ విగళన్మధునిర్భరాశమై.

(1962)

## మహానుభూతి

చిరహేమంత దశావిశీర్ణ తనుయష్టిన్,పాండురీభూత మ
ర్మర పత్రచ్యుతి మ్రోడువాఱితి ; భవన్మార్గంబునన్ నీవు చై
త్ర రమాదేవత, వింత చేరగనె యంతఃప్రాణనాళీ విని
ర్భర మాధుర్య మహానుభూతి మెయి స్తంభంబేర్పడెన్‌జు మ్మిటన్.

సుధ నాప్యాయితమైనటుల్ తను మనస్సుల్ రెక్కొనన్, పూర్ణిమా
తిథి యేతెంచుగతిన్ ప్రసన్న మృదుదీప్తిన్ దవ్వులన్, లోచనా
తిథివై వచ్చెడి నీ యుదాత్త శుభమూర్తిన్, డగ్గఱన్ జాలకే
పథ మల్లంత దొలంగి నిల్చితి జుమీ! పారిప్లవచ్చేతనన్.

లో వెలి నెన్నడున్ విడక లోగొని యెల్లెడ నీవె నిండియున్
నీ వెదురొటయే కలుగనేరదు; నా, చనుత్రోవ నెన్నడున్
భావ సుధాబ్ధి వీచికలపై కలపై నడయాడు నీవా! యీ
నీవు మఱీవా! యేనెఱుగనేరక సూవె! తొలంగి నిల్చితిన్.

నీ రాకన్ గనినంత లోయెద యెదో నిర్మథ్యమానాంతర
క్షీరాంభోనిధి గర్భవీథిమయి లేచెన్, వీచి యువ్వెత్తు; జ్యో
త్స్నా రారాజ దనంత పూర్ణశశి లిప్సావ్యగ్రమో కాక! తద్
భారం బోర్వగరాక, యే, దొలకితిన్, పర్యంత మర్యాదకున్.

సమలెన్నేని గతింపనిమ్ము! ప్రథమాశారాగముందోగి, బిం
బమవై యే, తొలినాట నిట్టి మధురస్పందంబు,నా నిండుడెం
దమునన్, జాబిలి వోలె సూచితివా! స్పందం బద్దియే సుమ్ము దై
వము వోలెన్ నినుగన్నవేళల మదిన్ వైవశ్యమున్ గూర్చెడున్.

(1964)

## చిర నిరీక్షి తాతిథి

మత్ పరధ్యాన మేమందు! మార్గమందు
త్వ త్పరధ్యానముద్ర నా తలపు నిండి
అరుగుచుంటినే; నా యఖిలాధ్వములను
అఖిల వేళలయందు నెల్లైనగాని
నీ వెదురు వచ్చు,టదికల్లనే!! యటంచు
ప్రాణమున కంటి పరిదుర్బలాశ— ఒకడు.

కడచి ఎన్నేని యుత్కలికాభరమ్ము
లరిగి మజ్జీవితానేహ మంతనంత—
నీ వెదురె రావా! బ్రదుకు లెన్నేని గడచి
అణగె నాయాశ భస్మసుప్తాగ్ని యగుచు.

నా సుకృత లేశమేమొ! జ్యోత్స్నాయమాన
మయ్యె నేడిదె మన్నయనాగ్రసీమ;
ఓ చిర నిరీక్షితాతిథీ!! ఓపజాల
నీ యెదుట నిల్వనైన—

(1965)

# నీ వెవరు!

నీ కభిధ లేద; ఒకటను నిన్నెఱుంగ
రాద; నీ మూర్తి అవిదితస్వాదువెదియొ!
కేవల వ్యంజనవుగ మద్భావ నిభృత
గేహళిని నిల్చి నను ప్రతీక్షింతు వెపుడు.

నీవు మత్ప్రాణ మూలంబు నెలవుకొనియె
నిస్వనింతువు కలవిపంచికయ వోలె–
ఆ, కలధ్వని సంస్థాన మరయరాక
నిలువనేరక నే ప్రతి నిస్వనింతు.

నీవు నాలోనె కనరాక నిలిచి యెందొ
విధుర భావప్రపంచంబు విస్తరించి
తలచిన తలంపు పలికిన పలుకు నమృత
సించితంబుగ కృప విరచించుచుందు.

నీవు నాయందె సుచిర నిర్ణీతవయ్యు
అలసితెందెందొ గ్రీష్మశైవలిని వోలె
నీ యవిజ్ఞాత హృదయభరాయతోష్మ
మంద మందోచ్ఛ్వసితమె నామది నదింప.

నీవు నిద్రాళు మచ్చిత్త నీరనిధిని
నర్తన మొనర్తు, నవిరతావర్తశోభ
నెగయు శీకరములును, డిండీరములు, న
భంగ భంగమ్ము, లతల గర్భగత మణులు.

నీవు లోలో జపారాగ నిభృత శోభ
నావరించితి మచ్చరమాశయెల్ల
లీన మద్భావ గగనాధ్వనీన శత స
హస్ర తారలు తెరతీసినట్లె వెలుగ.

నీవు పవలెల్ల మత్ప్రాణనిలయలీన
వగుట కనరాక నాకు, నిశాత్యయముల
నిగిడి యెక్కింతవడి రజనీముఖముల
లీల వెలిగింతు వమృతాంశులేఖ వగుచు.

నీ వఖిల శబ్దశక్తి నిర్ణీతి సార
ధీ ప్రమాణావు రస జగజ్జీవనమువు
నీ కృపాపాలితంబు మన్నిఖిల కావ్య
నిర్మితి సమీహమాన మనీషయెల్ల.

(1965)

## 'నీవు రావేని – ధరణికి'

నిన్ను—నా శైశవమునాడు నిరతకావ్య
జలధిమథనావసాన ప్రశాంతసంధ్య
నరయ దిగులయ్యె గగన దూరాంచలముల
నలతి నెలవంక డోల నుయ్యాలలూగ—

అమర వాణీ ప్రణీత కావ్యామృతములు
కరువునంబోయు నామది; కరడుగొనుచు
నిగిడి నీమూర్తి మిన్నుల నిలిచె; గళిత
బహుళ భయ నిత్యశారద తుహిన రుచిగ.

అబ్ధి గగనమ్ములను దాటి యవలనున్న
నిన్ను చేరంగరాద; నా, కెన్నడైన
మిన్ను డిగి నీవె వత్తువోయన్న యాశ
అబ్ధి గగనమ్ములకునైన నాగరాదు.

ప్రతి దినాంతమ్ము ఘుసృణప్రవాళశోణ
చరమ గగనాధ్వముల భవచ్చరణముల శ
శాంక డోలా చలాచలోచ్చలిత కింకి
ణీ నినాదంబె నాయెద నిర్మథించు.

నీవు రావేని ధరణికి—నిర్దళన్మ
దీయహృచ్ఛోణితమున, ద్వితీయసంధ్య
నావహించెద నరుణ వర్ణాభిరామ
మగుచు నీ మూర్తి నాయెద హత్తికొనగ.

(1965)

## నా స్థితి

నా స్థితి యిదేమొ! శీర్షదఘ్న హిమపాత
లీన హేమంత చిర నిశా స్థాణువనగ
ముకుళితాళిక నయనమ్మై మూర్ధ గగన
నిహత మిహికాంశు రుచి లవోన్మిషిత మగుచు—

ఛన్న మౌళి శిలాభ తుషార ఘటల
నిటల బర్హిః ప్రదోహంబు నెట్టుకొనక—
విలులిత మృణాళతంతు పేశల సుధాంశు
సారణీరేఖ సమ్మృతంపు జాలులేక—

కాలమునకైన కాలంబు కాలగళుడు
మృత్యువునకైన మృత్యువు హృదయవీథి
విలయు శీతల భావంబు నొలయుచేసి
పరముడుండె సర్వక్రియా విరతవృత్తి!

ఉత్తరంబున హిమగిరి నెత్తము పయి—
అగసుత అనంగసూతికాపాంగరేఖ
యోగ నిష్క్రాంతమున బుచ్చె నూరుపొకటి
జడజగత్ ప్రాణవీథు లూష్మలతదాల్ప.

(1965)

## కానన జ్యోత్స్న

నా వనికి నామనియె రాదు; రావు జలద
మాలలును, నిత్యమిచట హేమంతమె! పయి
కలదుసైదోడు శిశిర మొక్కడు—పురాణ
పర్ణములకైన క్షణము నిల్వంగరాక—

మఱి—అనీదృశ శిశిర హేమంతములకు
మాపు లోబడి చెల్లు సామంత మిదియు—
నీ తలంపు వెన్నెల, లట నిండి రేలు
శాశ్వత శరన్నిశీథైక శాసనంబె.

లేవు రేలివ్వ నందనాళిందములను
చైత్రరథ వీథులను రావు రాత్రులివియు
నీ విచట కాయుచుంటి నిర్నిద్రవగుచు
కానన జ్యోత్స్న వీవును స్థాణువేను.

(1965)

## చైత్ర హూతి

మఱల నేతెంచితే చైత్రమా! విశీర్ణ
జీవలోక ప్రియాతిథీ ! నీవె ఆజ్య
మగుచు గ్రీష్మేంధనము శరత్ హవియు నగుచు
ఇష్టి కొనసాగుబో! ఇంక సృష్టి మఱల.

అళిగీతి స్పృహణీయముల్ సుమవధూహార్దామృతంబుల్ సుఖా
నిలముల్ శీర్ణ మహీజ పల్లవ నవోన్మేషంబులున్ కోకిలా
కుల సీమాంతములున్ మనోభవదరాకూతోల్లసచ్చేష్టితం
బులు కాంతమ్ములు జీవలోక మధురమ్ముల్ శైశిరాహ్లాంతముల్.

జరుగ వర్షపరంపరల్ మఱల మఱల
సృష్టితరు శాఖికాగ్రముల్ చివురు దొడుగు
నవనవోదిత పద్మబాంధవ మరీచి
ప్రాచి వెలయించు క్రొత్త లెప్పటికి నపుడె.

కలకంఠప్రియహూతి నెవ్వరిట నాకర్ణింప! నెవ్వారి కీ
యళిగీతుల్! శుకశారికాపిక కలవ్యాహారమే వీనులం
దొలికించున్ సుధ ! లీ సువర్ణమయ ప్రత్యూషాబ్జ బందూరయు
మ్ములకెవ్వారిట నర్ఘ్యమెత్తెదరు! సంపుల్లాశయాబ్జంబులన్?

ఆధివ్యాధి జరామృతి
బాధితమగు జీవలోక పరిణతిలో, నీ
గాథలె త్రవ్వి నవత్వము
సాధింపనె కవికులంపు జతనములెల్లన్.

సమతీత స్మృతివల్లు లల్లుకొని, నాస్వాంతంబు పుష్పించు తీ
యము; లేనాటి యనుంగులో! చరమసంధ్యా మల్లికాముగ్ధ జీ
వములై నీ వరుదెంచువేళ, పునరావర్తంబులై వచ్చి – సౌ
ఖ్యము దుఃఖంబనరాని నిర్వృతి నెదంగల్పించు, చైత్రాతిథీ!

నీతోడన్ బ్రభవించు పుష్పజగముల్ నిర్వ్యాజ ముగ్ధంబులై
నీ,తోబుట్టులు తేనియల్ వలపులున్ నీ వార్తాశ్రితాస్థానివై
నీతో–సృష్టి నవీకృతంబగు జరానీహార నిర్ముక్తమై
నీతోడన్ రసభావ నిత్యసుషమల్ నిండారు విశ్వంబులన్.

నీ,వేతెంచెడి మార్గముల్ కిసలయానీకోల్లసత్తోరణ
వ్యావిద్ధాంబరముల్, మరంద సుమనఃపాత్రీకృతార్ఘ్యంబు, లా
శావిశ్రావిత కాహళీ పికకలవ్యాహారముల్ సృష్టికిన్
భావావేశము, వీ, వనన్యజ పునః ప్రాణానిలస్పందమై.

సుమములనె కాదహో ! జీవ సుమములందు
నింపెదు వికాసముల్ ప్రణయంపు మధువు;
వనములేకాదు సృష్టిజీవనములెల్ల
జీవశోభాదరిద్రముల్ నీవు లేక.

తొలి నీరాక నిగుర్చు తత్ కిసలయస్తోమంబె హేమంతవే
ళలకున్ పండుచు పర్ణశద్యముల లీలన్ వ్రాలి, కాంచున్ సము
జ్జ్వల రాగద్యుతులన్ కిసాలయ పునర్జన్మంబు; దోబూచి యా
టలెపో! నిత్యము చేతనుల్ మలయుచుండన్ మింటికిన్ మంటికిన్.

రోచిర్మయ మజరామర
మై చేతోమోహనము చరాచరమెల్లన్
నీ చైతన్యమె నిండెను
ప్రాచేతస వాఙ్మధూపవన నిర్భరమై.

ఆనందప్రభవంబె భూతనివహం, బానంద సంస్థానమే,
ఆనందంబున యందె డిందు, నను నయ్యానందవల్లీ వచః

సానాధ్యంబున కెన్న నిన్ విడిచి దృష్టాంతంబు లేదెందు; న
ద్దానన్ జైత్రమ! నీదు కీర్తులలరున్ త్రయ్యంత గేయంబులై

(1986)

## పుష్కర గౌతమి

అర్ఘ్యంభోజము తేజమొక్కడు స్వయంవ్యక్తంబు సర్గోన్ముఖం
బై ధ్యానస్థితి నూన దత్తపములే అంభోమహోరూపమై
మధ్యేగంగముగా మరాళ ధవళాంభః సర్వ తీర్థౌఘ సా
న్నిధ్యంబై ప్రభవించు పుష్కరపతీ! నిర్నిద్రభద్రాకృతీ!

సార్ధ త్రికోటి పావన
తీర్థ మహాపరిషదధిపతీ! దివ్యనుతీ!
ధూర్తరములు మాయఘములు
నిర్ధుత మొనరింపవే! ధునీకృత వసతీ!

నీయందె నిలుతు రటవే!
ధ్యేయాకృతులై పితాళ్లు దివిజు, లజుడు, నా
రాయణుడు, శంకరుడు, గం
గా యమునా కృష్ణ లాదిగా నిఖిల నదుల్!

సతత త్రైగుణ్యవశా
ద్భృత మాయాఖేలనమున మోహాకళావం
చిత యగు చితికి స్వరూప
స్మృతి పుష్కరు కరుణగాక, యెటు సిద్ధిందున్?

సింహస్థితుండైన శ్రీదేవగురునితో
 వఱలంగ ద్వాదశ వర్షములకు
దిరుగా; త్రిలింగధాత్రీ కంఠమౌక్తిక
 దామమౌ పుణ్య గోదావరికిని
తరళదీధితులతో తెరలి యేతెంచు
 పుష్కరదేవ! నీకు సుస్వాగతంబు
నీవెంట నరుదెంచు నిఖిల తీర్థములకు
 సురలకు మునులకు స్తుతిశతములు

ఈ మహావారి ప్రవహించు నెన్నిసీమ
లన్నిసీమలు భవదీయ సన్నిధాన
బిందు బింద్వంతరాంతరావిర్భవద్వ
శక్త రోచిశ్చటలు మాకు రక్ష యగుత!

ఆయాతాఖిల వారిదేవతలతో నాతిథ్యపూజామహా
శ్రీయోగంబున సందడించెదవు నీ శ్రీవారి యువ్వారియై
మాయిండ్లన్ ధనధాన్య సంపదలు నింపన్ జాడుమీ! పుష్కర
శ్రేయోవేళల నాతిథేయ పరమశ్రీమూర్తి! గోదావరీ!

అక్కాచెల్లెండ్రన్నను
మక్కువ నీకెంతొ యెంత మాయిండులలో;
ఒక్కరొకరెడసికలిసిన
చిక్కని సంబరముశోభ చెప్పసలవియే!

నీ యుభయతీర సంస్థిత నిఖిలదేవ
తా కృపాలక్ష్మి దామర తంపరగుచు
వరలికెరలుచు నీదు పుష్కరశతంబు
కనుల జాతురుగాక నీ కన్నప్రజలు.

చిందితి, విందునందు శశిశేఖరమౌళి సరోరవింద ని
ష్యందమవై! భగీరథ పురాత్త ధరాగత సౌరవాటికిన్
ముందరొ వెన్కయో! యెఱుగబోవముగా, కల, గౌతమా శ్రమా
ళిందములందు నీ, తుఱగలించుట లెంచెద మాంధ్రవాహినీ!

(1979)

## రాజ మహేంద్రవరము

ఏరాజ్యంబులు సాగనీ ! మఱియు దా మేరాజులే యేలనీ!
చేరన్ నాటికి నేటికిన్ బుధులు, నిన్ శ్రీగౌతమాసత్యవా
ఃపూరంబుల్ సయిదోడుగా సుకవితాభోగం బవిచ్చిన్న ధా
రా రమ్యంబగు రాణ్మహేంద్రనగరీ ! రాజద్యశోవైఖరీ !

(1979)

## చంద నాందోళిక
### (పాపయారాధ్య భారతి – అమరావతి)

ఖద్యోతద్యుతిపుంజ పింజర వియత్ కల్పద్రు శాఖాశిఖా
సద్యోనిర్దళిత ప్రసూనజ రజస్సంఛన్న పుష్పంధయ
స్విద్యత్తాన వితాన మోహన రుతిన్ విచ్చేసితో!వేమనా
రాధ్యామ్నాయజ,వాణి,నేడు స్మృతిధారా పాపయారాధ్యమై.

భద్రశ్రీపరికర్మనిర్మిత మహాపల్యంకికాసీనయై
క్షుద్రూజాంగదు తోడబుట్టు విటురాగా; మాఱుమ్రోసెన్ దిశల్
రుద్రాణీ పరివారతాళగతులన్ రోదోంతరంబెల్ల; పు
ష్పద్రోణీకృతవర్ష, హర్షభర విద్యద్జృంభరామ్నాతమై.

దేవీ శంభలికా ఝళంఝళిత పన్నీరేజ మంజీరజా
రావంబౌనా! గణాధిభూ, ఘణఘణ గ్రైవేయ ఘంటాగ్ర సం
రావంబౌనా! శిలాదనందముఖ ప్రాధ్మాత శంఖోత్థ భుం
భూవిస్ఫూర్జిత ఘోషమౌనా! మథితాంభోరాశి నిర్ఘోషమై.

కల్యాణాచలకార్ముకాద్రితనయా కల్యాణవేళా మహా
పల్యంకీకృత వల్గుయాన వృషరాట్పల్యాణ కల్యాణియై
కల్యాణామరకావ్యలక్ష్మి,పురమేగన్ వాడలున్ వాడలున్
కల్యాణాద్రులలో! క్రౌంచభూధరములో! కైలాసశైలంబులో!

రింఖత్తరంగాగ్ర కంకణయై కృష్ణ
చిన్నారి ముత్యాల సేస లొలికె
శింజాన మంజీర శివుని పట్టపుదేవి
మలరాచకన్నియ తలుపు తెఱచె
అమరేశ శివ కపర్దాటవీ కుటి నిక్కి
తొలివంక జాబిల్లి తొంగిచూచె
అంతలంతలనుండి ఆరాధ్య గృహలక్ష్మి
పుల్కుపుల్కున నేదొ పొల్చికొనియె

నాథసంకల్ప త్రైపురానందదత్త
చందనాందోళికాగ్ర నిషణ్ణ యగుచు
వెండి యమరావతీ పురవీథులందు
పాపయారాధ్యభారతి పరిఢవింప.

(1988)

## శ్రీ వేణుగోపాలస్వామి

(రాజ మహేంద్రవరము)

సోనలు సోనలై సురవనాంత లతాంత
భరములు కుంతలభరము నిండ
భుగభుగలై ఫాల మృగమద తిలక
సౌరభవీచు లాశాంతరముల గ్రమ్మ
భుగ్నాంచలంబైన భ్రూవిలాసంబున
భువనముల్ సమ్మోహమున మునుంగ
సుషిరోద్గిరన్నాద సురధునీ మగ్నమై
చేతనాచేతన ఖ్యాతివదల
కలువలను దమ్ములను నేలు క్రాలుగన్ను
లరవిరగ బ్రహ్మగీతి పరాయణమగు
దహర బృందావనాంతర విహరమాణ
మాధురికి మంగళము రసామ్నాయమునకు.

(1980)

## శ్రీ శ్రీ శ్రీ లక్ష్మణ యతీంద్రులు

నిను గన్నంతన నా హృదంతరమునన్ నీలద్యుతుల్ నిండి – న
ల్లని యేర్లై మొయిళ్లై మయూరమయి వల్గద్భ్రూలతాపాంగ మో
హన విద్యుత్ సుషమా నిరస్త కుహకంబై గీత మేనాటిదో
వినదింపన్–కతమేమి? లక్ష్మణయతీ! నిర్వ్యాజహార్దాకృతీ!

నీ యెదలో నాడెడుతరి
నా యెద నొక్కడుగునిడ, క్వణత్ కింకిణితో

మీ యదుపతితో జెప్పుము
యా! యతికుల చంద్రమా! దయాసాంద్రరమా!

(1990)

## 'ప్రొద్దు పొడిచె-'

ప్రొద్దు పొడిచె నేడు పులినోటవిడివడ్డ
కండవలె తమోముఖంబు వెడలి
పుడమి బ్రదుకులెల్ల కడగండ్లు కడద్రొక్కి
వెడలుగాక! నిండు వెలుగు లలమి.

ఇంక నైదునాళ్లకే గన్నువిప్పెద
నెఱుగ దొల్లి లోక మెట్లు నడిచె
నెఱుగ మఱియు ముంద రేరీతి నడచునో!
కన్ను మూసి నేను చన్నపిదప.

కొన్ని చూచిచూచి-కొన్నింటి మూర్కొ-
కొన్ని సోకిసోకి-కొన్నిటి విని
కొన్ని యానియాని-ఇన్నింటి దలపోయు
నెడమెలేక తాను కడచె ప్రొద్దు!

ఇందు నన్ను వదలి ఎందేగిరో! అమ్మ
నాన్న, లన్న, లల్ల నాటి చెలులు!
తలప ధరణి బ్రదుకె దాగిలిమూతయో!
వారలెందొ! కానరారు మఱల.

తవిలి తవిలి వారిదలపోయ దలపోయ
వత్తు రెవ్వరెవరొ! క్రొత్తచెలులు
అంతలోనె ప్రాతలై వీర లరిగిన
వత్తు రెవరొ మఱల గ్రొత్తవారు.

తప్పి పోయిరేని తామొక్క రేనియు
నన్ను జేరరార; ఎన్నటికిని-

ఇంత దిగులు బరువు లెద మోసిమోసియు
నాట విడుపు గోరదామె నెపుడు.

ఇన్ని యుగము లేగి, యిన్ని పుట్టువు లేగి
ఆట యిద్ది ప్రాతయాౖెె యనుచు
ఎంత రూఢియైన నెప్పటి కపుడేదొ
క్రొత్త వోలె మరులు చిత్త మలము.

ఏను క్రొత్తకాద; యీసృష్టి కిది కాదు
నాకు గ్రొత్త; యిది సనాతనంబ;
ఏ సనాతనుడ; త్రయీమూర్తి యేఱుకయై
పూర్వశిఖరి మీద పొడిచె నిసుడు.

ఉంటిదొల్లి; యిపుడు నున్నాడ; నుండెద
ముందు; నెల్ల ప్రొద్దు నుందుౖెె యియి;
ఇన్ని రూపు లేర్పఱించి, పేరులు నేర్ప
ఱించి యుందుమని 'శివేచ్ఛ'యగుట.

(1989)

* * * *

ఏ నిందుండను గొంచుబొమ్ము వనికిన్, హేలా సరోజాత మా
లానేత్రాంశుల గన్నబిడ్డల వనైలా వల్లరీబాల శా
లానిద్రాగతులం దృజించి మణిమాలా సౌధతూలాచ్ఛ శ
య్యా నిద్రం గనలేను బ్రయ్యెపడలే నారీతి నిద్రించుచున్.

—విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము,
అయోధ్య – మునిశాప, 115.

## 'వేములవాడ'

## శ్రీ వేణుగోపాల శతకము

శ్రీమ న్నీల పయోధరాంగ ! కరుణా శ్రీమందిరాపాంగ ! ని
స్సీమానాది రజోవిభంగ ! శ్రితరాజీ చాతకాసంగ ! వం
శీమంద్రస్తనితానుషంగ ! సకృదాశ్లేషోన్మిష ద్వ్యావత
శ్రీమద్విద్యుదభంగ ! 'వేములవాడ' శ్రీవేణుగోపాలకా !

మౌళిస్ఫార మయూరపింఛ భరమై, మాహేంద్ర నీలద్యుతి
వ్యాలోలాలక ఫాల మొప్పెసగ, వ్యత్యస్తాంఘ్రి పద్మంబులన్
కేళీమోహనమౌ త్రిభంగి వలిత గ్రీవంబుగా నిల్చు, నీ
లీలా కేకర దృష్టి బ్రోచు భువనాళిన్ వేణుగోపాలకా !

నీ వంశీధ్వని వాహినుల్ వరదలై నిండార బ్రహ్మాండముల్
ద్యోవీథిన్ గ్రహతారకాగణము చిందున్ బిందులై బిందులై
జీవాంతర్ హృదయాంబరంబు నినదించెన్ స్పందమై మంద్రమై
నీ వేణుధ్వని స్థూల సూక్ష్మములు నిండెన్ వేణుగోపాలకా !

సదయా ! యింద్రియధేనువుల్ విషయ ఘాసగ్రాసలోలమ్ములై
బ్రదుకుంబీడులబట్టి నిన్ మఱచి పోవంబోవ బ్రాయుంపు బ్రొ
ద్దదె డిందన్ బయిగ్రమ్ము చీకటులలో నల్లాడవే ? సుంత , నీ
మృదువౌ మోవిని పిల్లగ్రోవి నిడవేనీ ! వేణుగోపాలకా !

స్మయుదబ్జాక్ష ! ఘటింపవే యెపుడు నా స్వాంతంబునన్ నీదు ప
ల్లియమో! నల్లని యేఱొ! పచ్చబయలో! లేదూడలో! బాలు వ
ల్లియమో! పిల్లనగ్రోవియో ! నెనరులో ! లేజూపులో ! నెమ్మిపిం
చియమో ! వంచిన యోరమోపు నవురో ! శ్రీవేణు గోపాలకా !

ఒప్పౌల్ కుప్పలువోసినట్లులరు నీ యొయ్యారమే యెంతునో !
చిప్పంగూకట నెమ్మికంటి హరువౌ సింగార మూహింతునో !
కప్పన్ దిక్కుల దావి నెన్నొసటిపై కస్తూరి ధ్యానింతునో !
చెప్పంగిప్పగరావు నీ హొయలు లో శ్రీ వేణు గోపాలకా !

మృదులాలోల కరాంగుళీ దళిత వంశీరంధ్ర గర్భంబులన్
పొదలన్ మిన్నులు బూరటిల్లగ రసాంభోరాశి ; యేనాటివో
హృదయ గ్రంథులు వ్రీల వ్రాలి రబలల్ వ్రేపల్లెపై యెల్లలన్
ప్రిదులు న్నీవులు జాఱు క్రొమ్ముడులునై శ్రీ వేణు గోపాలకా !

నీ మైనీడల నల్లనల్లన ప్రభూ ! నిండింపవే ! అంతర
వ్యోమంబంతయు నంత నంత శిశిరీభూతంబుగా, కాలదిక్
సీమల్ దాటిన తెల్వి నెమ్మనయి నే క్రీడించెదన్, నీరద
శ్యామంబైన వెలుంగులోన బురివిచ్చన్ శ్రీ వేణు గోపాలకా !

కుంద క్షీర మృణాళ హంస నిభముల్ గోబృందముల్ ధ్యాన ని
ష్పందంబుల్ నినుజుట్టి నిల్చిన వయా ! సమ్మీలితాక్షంబులై
బృందారణ్యము త్రోవ లెల్లెడల నాపీన స్రవత్ క్షీరముల్
చిందుల్ మానిన లేగదూడగములై శ్రీ వేణు గోపాలకా!

సిరి నిండారిన తమ్మిమొగ్గ గుఱుతై శ్రీ రుక్మిణీ స్ఫూర్తితో
సరసీజాలయు నిల్వ నీ వలపటన్ ; సాత్రాజితీ మూర్తియై
ధరణీ దేవియు డాయ డాపట ; భవద్దాక్షిణ్య సంపత్తియే
సిరులై సంపదలై జగంబు మనుచున్ శ్రీ వేణు గోపాలకా !

పొదలన్ వేణువులో నినాదముగ నూర్పుల్, మౌళి పింఛచ్ఛవుల్
కదలన్, గంకణ కింకిణీ కిణికిణీ క్వాణంబు నా వీనులన్
మెదలన్, లోయెద జాడ్యమెల్ల వదలన్, నీలద్యుతీ ! నెవ్వగల్
ప్రిదులన్ మన్నన నన్ను డాయు టెపుడో ! శ్రీ వేణుగోపాలకా !

అతసీసూన సవర్ణ ! మత్తను మనః ప్రాణంబులన్ నీకరా
ర్పిత వంశంబుగజూడు ! జాగర సుషుప్తి స్వప్న మార్గంబులన్

వితయై యూరుపు టేటు పాటు ; నిట నీ నిశ్వాస మల్లంత నిం
చితివే నిందు భవంబు సార్థక మగున్ శ్రీ వేణుగోపాలకా

వెనుకం దోలిన ముందు తోలినను నీవే ! మత్తనూ స్యందనం
బున బోధామృత హర్షవర్షముల నంభోదంబవై క్రమ్మి పా
రణ సేయింపగ దేటుచున్నవి మనః ప్రాణంబు లల్లంత దే
టినపై జాలు విదల్చు వాజుల ససిన్ శ్రీ వేణుగోపాలకా !

వన్నెల్ ! వన్నెలు ! పిన్న కూకటులపై బర్హావతంసాద్భుతీ !
కన్నుల్ ! కన్నులు ! నెమ్మిగుంపుల మెయిన్ గాంతార ఖేలారతీ !
వెన్నల్ ! వెన్నెలు ! మోవి కెంజిగురుపై వ్రీడా విహీనాకృతీ !
చిన్నెల్ ! చిన్నెలు ! చిన్ని చెక్కిళులపై శ్రీ వేణుగోపాలకా !

ఘలుఘల్ ఘల్లన గింకిణీ కిణికిణుల్ కాళీయ భాస్వత్ ఫణా
తల రత్నస్థలులందు గ్రేళ్ళుటికి నృత్తంబాడు నెత్తమ్ము లా
లలితాంఘ్రిద్వయి క్రింద నేర్పుటుతు నుల్లం బల్లనన్ మెత్తనా
జిలుగుల్ జిల్గులుగాగ నొత్తమికినై శ్రీ వేణుగోపాలకా !

* * * *

బిట్టుగు కోపశోకముల వీథియొగమ్ముగను జూపకుండ నే
పట్టుల నిండ్లలో నొదుగ బౌరులు, నిర్జనవీథులందు నా
కట్టిన బండిరా దలుపుకంతల బిల్లలుచూడ బాపపుం
గట్టెలబండి, దాని గనగా వలదంచును దల్లు లాడగన్

—విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము,
అయోధ్య — మునిశాప, 98.

# దీప కళిక
## (అనువాద కవితలు)

మల్లంపల్లి శరభయ్య

చైతన్య కవితా వేదిక
ఆర్ 2, జ్ఞాన భారతి
బెంగుళూరు 560 056.

## శ్రీ అల్లాదేవి వాక్కులు

తెలిసి జడులును కనియు సంధులు
వినియు బధిరులు నిలుతు రెటనో !
విమల తత్త్వాభ్యాస మలవడు
వేత్త లీ జగతిన్.

రాకరాక మనుష్య జన్మము
ప్రాకు లాడను భాగ్యములకై
చీకు చింతలు చేరవెన్నడు
శివుడె మది నిండన్.

శివుడొ విష్ణువొ జినుడొ కానీ –
పిలువ పేరేదైన నేమీ !
అజవంజవ రోగ పీడిత
సబల నను బ్రోవన్ .

మదిరయో ! మాంసందొ ! పూజా
విధికి నెయ్యదియైన నేమీ?
దహర గుహ – ఓంకార ముఖరిత
కుహరమై యుండన్ .

ఏటి గట్టున ప్రొద్దు వాలెను
బాట తప్పితి కాసు లేదిక
దాటబెట్టెడు వాని కెయ్యది
తడయకే నిత్తున్ !

కలగ నేటికె? బేల మనసా !
కలుగ నీకై యుభవుడే భవ
జలధి దాటింపంగ ; నెపుడో
పిలుపు వీతెంచున్ .

అంధ బధిర న్యాయమున భవ
సింధు మధ్యము నందు నిలిచీ
అంధకాంతకు పిలుపు విని నే
హేర తయ్యేదనూ —

వాలగా జాబిల్లి జాలిగా నా గుండె
వాలుగా నొకపాట జాలు వారినదీ
చాలనే నినువెదుక 'లాలసను' 'లాలసను'
మేలుకో నావెలుగ ! మేలుకో వెలుగ !

తంత్ర మణగెను మంత్ర మందున
మంత్ర మణగెను చిత్త మందున
చిత్త మణగిన దృశ్య మంతయు
శివుని యందణగెన్.

నీవు లేవట నేను లేనట
ధ్యేయమును ధ్యానమ్ము లేదట
భావ మంతయు తానె తనలో
లీనమై యుండన్.

విమల జలములు హిమజడమ్ములై
హిమము శిలయై యెండ సోకిన
కరగు లీల చరాచరంబులు
శివుడుగా కరిగెన్.

ఇల్లు వెడలితి 'లల్ల' నే, నూ
రెల్ల వెదుకగ విభుని, నాదగు
ఉల్లమను ఉయ్యాల లోనే
ఒదిగి శివుదుండన్.

శివుడు గుజ్జము జీను విష్ణువు
పంకజాసను డంకె వన్నియు
పొంకముగ పై స్వారి చేసే
అంకకా డెవడో !

ఇందుశేఖర ! నీకు పూజా
చెవిడనాక్షత కుసుమ పరికర
మింద మనుటకు నేర, నిన్నిట
ముందె నీ యునికిన్.

వచ్చి జన్మకిట వారక కంటిని
అచ్చపు తెలివిని అతి సహజముగా
చచ్చెద నెవనికి ! చత్తురెవ్వరిట !
చచ్చుట చావమి సమమైయుండగ !

మాతృ గర్భ స్థితి వినిర్గతి
యాతనల బడి పొరిలి పుట్టుచు
వేసటొఱుగకె స్త్రీసుఖమునకె
వేడ్కపడనేలా ?

పాలొసంగును తల్లియై, స్మర
కేళి దేల్చును తరుణి యై, స్మృతి
జాల మెడపును మృత్యువై శివ
లీలయే జగతిన్.

శిల యొకండే గోపురము గుడి
వెలయు పీఠము వేలుపున్నై
చెలగువిధమున శివుడొకండే
కల జగంబెల్లన్.

సీమ సీమల సూర్యకరములె
గీము గీమున వ్యోమబిలములె
జీవి జీవియు లోన పరశివ
చేతనయె వెలుగున్.

చెలువ చిత్తమె క్రొత్త, శశిరేఖయే క్రొత్త
చెలువ నెమ్మోయి క్రొత్త, జగమెల్ల సరిక్రొత్త
శివకృపా సలిలముల జలక మాడెనుగాన—
తవిలి, లల్లాదేవి తనకు తానే క్రొత్త!

# సూక్తి సుధ

సారహీనమైన సంసారమున, సార
మీచతుష్టయంబె యెంచి చూడ ;
కాశికానివాస గంగాంబుమజ్జన
సుజనసంగ శంభుభజనములును.

అలుక యుపకారి జనములయందదేల ?
అలుకపై నలుక దాల్పంగ వలదె బుధుడు !
సకల పురుషార్థముల భస్మ సాత్కరించు
నలుక కన్నను శత్రువు లవని నెవరు ?

తనుదాన యెవ్విధమ్మున
మనసు విషయజాలముల నిమగ్నంబగు, న
య్యనువున బ్రహ్మమున దవుల్
కొనెనే, నెవ్వండు విడుపుగొనడు భవమునన్ .

లేని గుణంబులె సుజనుడు,
లేనివె దోషంబు లొరుల లెక్కిడు కుజనుం,
డూనుకొని, రెండు దబ్బర
లైనను, పైకరుగు నొక్క, డడుగున కొకడున్

పుట్టుగ్రుడ్డులు నిజదోష భూధరముల
దివ్యచక్షులు పరదోష తిలల నైన
స్వగుణ భేరీ నినాదైక బధిరితాశు
లితర వర్ణైక ధృత మునివ్రతులు ఖలులు !

అరిగిరి యురుగుచు నున్నా
రరిగెద రత్యంత శోక హతులై మృతులై
నరవాహిని నెవడాగును !
నిరపాయిని కావ్యకీర్తి నిలిపెడుగాకన్.

ఇల గుణవంతుల గను లో
పల – నెద ముడివడుచునున్న బంధన భీతిన్

తొలగి సిరి, లేడి పోలిక
పలాయనము చిత్తగించు బహుదూరముగా.

ఒక్క సుళువు నీకు నిక్కమ్ము జగమెల్ల
వశమొనర్చికొనగ వలతువేని—
పలుకుటావు నెపుడు పరనిందలను పైరు
మేయకుండ మళ్లవేయు మయ్య !

కలహింపవు యాచింపవు
పలుకు లుడిగి యుందు వెలిచి పరనిందలకున్
పిలువంగ బడక చేరవు
శిలలును తామిందువలన 'జే జే' లయ్యేన్

## పరమార్థ సారము

### (మూలం : అభినవగుప్తపాదులు )

పరముడ ! మాయకున్ బయల పారములేని యనాది నౌచు నొ
క్కరుడవె యయ్యు పెక్కగువగన్ గుహలన్నిటి నీగుచున్, చరా
చరముల కాశ్రయుంబవయి సర్వగతుండవునైన నిన్నె నే
శరణమవంచు జేరితిని శంభువ ! బంభరి తాద్రిజాంబుజా !

అమల స్ఫటికము, నైక
క్రమవర్ణ సమూహాభాన రమణీయంబౌ
క్రమమున సుర నర పశు తరు
సముదయ రూపంబు దాల్చు శంభుడు తానై.

కదలెడు నీటం గదలుచు
బదిలపడిన నీట బదిలపుడు, చందురుడై
పొదలు శరీరేంద్రియ భువ
న దశా వ్యవహారమున సనాతనుడెలమిన్.

అమలిన దర్పణాంతరమునం దెడలేకయె యూరువల్లెలున్
రమణులు పూరుషావళి పరస్పర భిన్నములయ్యు, దామధి

న్నములయి గోచరించియు గనంగన, దర్పణమున్ విభిన్నమౌ;
విమల శివప్రకాశమున విశ్వమిటుల్ పరిదృశ్యమానమౌ.

బియ్యపు గింజం దనలో
లియ్యంబుగ బొదువు నుముక లీల, నొడలితో
వియ్య మొనరించి చేతన,
కెయ్యెడ ధర తుదిగ బ్రకృతి యెడయక యుండున్.

సరవిని బుణ్యపాపములు, స్వర్నిరయంబులు, జన్మ మృత్యువుల్,
పోరి సుఖదుఃఖయుగ్మమును బోల్పగ వర్ణము లాశ్రయంబు, లె
ప్పరుసున జిన్మయుండయిన స్వాత్మ మహేశ్వరు నంటిలేవు, ని
ల్వరమున; గాని విభ్రమ బలమ్మున నున్నటు దోచు నిన్నియున్.

తనుధర్మంబుల, ప్రాణధర్మముల, ధీధర్మంబులన్, శూన్య భా
వనలన్, బెక్కిటి, జుట్టి చుట్టి యట పైపై నల్లికల్ గాగ, న
ల్లిన జాలమ్ముల లోన జిక్కువడు సాలీడుంబలెన్,దన్నుదా
నె, నిబద్ధున్ బొనరించి యాత్మయిటు లెంతే జిక్కులన్ స్రుక్కెడున్.

తన యెఱుక వెల్లివిరియిం
చిన స్వాతంత్ర్యపు వెలుగుచే విప్పికొనున్
దను దానె ; కట్టువిడుపుల
సనాతనుం డిట్లు క్రీడ సలుపుచు నుండున్.

జలధరము పొగ దుమారం
బలమియు మలినంబుకాని యంబరముక్రియన్
కలిత వికారము మాయా
విలసనమున, నంటువడక వెలుగు బరముండున్.

తవుడు పొట్టు నుముక తగులంబులేని బి
య్యంపుగింజ యంకురింపనట్లు
లణువు మాయ కర్మమను మూటి బెడ బాసి
తనువు నెత్త దాత్మ ధరణి మఱల.

# దయాశతకము
## (మూలం : వేదాంత దేశికులు )

చెదరక మున్న కన్ను చెవి, చేడ్పడు మున్నట శ్వాసవృత్తి , తా
ట్రొదవక మున్న, మై గమనయోగ్యత డిందక మున్న, నీ వలెన్
ద్రిదుల జలప్రపాతములు పెంపగు నీ వృషశైల సానులన్
మధుమధనానుకంపరా ! దినంబులు నెమ్మది వెళ్ల బుచ్చెదన్.

వరవల నల్లెసన్ గురులు వారి పథంబులెతింగి త్రిప్ప, సు
స్థిరత లఘుత్వ మొప్పెదు గతిన్ బిగియాలి, గుణాళి, శేషభూ
ధరమను వీరరేఖకును దాటగబెట్టదు నావవోలె ; సం
సరణ మహోర్మి మగ్నజన సంతరణ త్వరమాణవై దయా !

పరిమేయాల్ప ఫలానుషంగమున నల్పప్రాణు లేతేర శ్రీ
గిరి పైనన్ నిగమాంతరాపణ సముత్కీర్ణాంశువున్, నిత్య ము
క్త రమాశ్లిష్టము గానిపించెద, వతర్క్య ప్రాప్తి, నోహో ! మహా
హరినీలంబు నొకానొకందు, కరుణా ! హార్దైక నిష్యందమున్

స్ఫురిత నాభీపద్మ సుషమాభిరామమై
    నీలోత్పల చ్ఛాయ లోలగింప
పాటకరించిన విశంకట వేంకటాహ్వాయ
    పరితోవిహారార్హగిరి రహింప
జిల్లనై సతత ప్రసన్నతా నిలయమై
    శ్రద్ధధాన జనైక సముపగాహ్యా
మహితానుభావమై మహనీయ పరిణాహ
    రమణీయమును, నభౌమమును , నిరవ
ధి ప్రకాశం బొకానొక దీర్ఘిక , భవ
దీయ, మింపారు గరుణరో ! ధృతి, ప్రపన్న
భరిత తాపత్రయైక నిర్హరణ బద్ధ
కంకణంబయి తొలకి కెలంకులకును.

నీ, యానన్ వివిధావతార గతులన్ లీలాపదేశంబునన్
శ్రేయోనాథుడు తాల్చి ప్రాకృత జనశ్రేణీ ప్రయుక్తావమా
నాయాసంబు భరించు మాత్రమె ! శ్రితవ్యాసక్తి, తత్కార్మభే
దాయాతంబులు కోటి జన్మలయినన్ దానెత్తుగాదే ! కృపా !

నిగుడ జలంబులన్ శ్రుతులు, నిండ సిరుల్ భువనంబులందు బ్రా
తిగ శ్రితపాపకూలములు త్రెల్లి పడన్ వడి నుర్వడించి, యు
త్యగణిత హంస మత్స్యకమఠాద్యవతారము లేర్పడన్, సురా
పగవలె, నిండి పాఱెదు కృపా ! పరితప్త భవాధ్వగప్రపా !

ఎసరేగన్ జలరాసు, లా ప్రళయమం, దేకోదకం బైన, నా
ర్వ, సమర్థంబులుగా, వవిద్యయును, నవ్వార్వంపుటగ్గిన్, గృపా !
వెసనార్పన్ బ్రవహింతు వీవట, త్రిపాద్విస్తార భూమ స్వరూ
ప సమున్మేష వృషాచలేశ గుణిత ద్వైగుణ్య బిందు ద్రుతిన్.

క్రియమాణ క్షణ నశ్వరంబగు క్రతుశ్రేణీ ఫలోత్సృష్టికై
నియమింపంబడియున్న దేవతతి తన్నిర్వేశపూర్వంబె య
త్యయమై కర్మ ఫలంబు దిక్కఱ ; నకాలాధీనవై శ్రీశిలో
చ్చయ నాథుంగొని పూట వెట్టె, దచలస్థైర్యాతిశాయీ! దయా!

హిత రతి ! దీనచింతిత మణీ ! ప్రభు నేత్రమణీ ఘృణీ! రమా
శ్రితుడగు దేవరన్ రఘుధురీణునిగా విరచించి దించి యీ
క్షితితలి, కీవు వార్ధి విభజించితి ; దర్శన మాత్రలో, పురా
కృత బహుకిల్బిషక్షపణ హేతువు సేతువుపేర, నో దయా !

బలవద్దైత్య పరంపరాహిత మహీ భారాపనోదక్రియా
చ్చల మొప్పన్ గృప ! శ్రీవికుంఠ నగరీ సౌధాంతరావాసి శ్రీ
నిలయున్ నేలకు దెచ్చి తోలితి గదే ! నీరంధ్ర మోహాంధ్య ; ము
చ్చెల ! నానా శ్రుతి సౌధ దీపకలికా శ్రీరీతితో గీతతో !

# సౌహృద భరమ్

## (సంస్కృత కవిత)

మల్లంపల్లి శరభయ్య

చైతన్య కవితా వేదిక
ఆర్ 2, జ్ఞాన భారతి
బెంగుళూరు 560 056.

శ్రీః

సంప్రదీయత ఇయంకృతిర్మయా
కావ్యజన్మని మమాగ్రజన్మనే
నూత్న కావ్యవచసాం విధాయినే
శేష పూర్వ సుకవీంద్రవేధనే ||

యేనా పూర్వమహార్థరత్న ఘృణయ స్సాహస్ర మావిష్కృతాః
వల్మీకాంతర గూఢగాఢమహసః ప్రాచేతసస్యోక్తిషు
ఆశ్చర్యం సుధియా ముపశ్చిమధియాం వైపశ్చితీ కాఽప్యసౌ
శేషేంద్రస్య గిరాంతనోతి సరణిః కావ్యాత్మ తేజోఽ రణిః ||

గ్రంథగ్రంథిషు యన్నిజేషువివృతిః స్వే నాత్మనాదర్శితా
శాస్త్రోక్తిష్వపి యేన యత్ ప్రియతమా సల్లాపలీలాయితం
దేవీవాక్ స్వయమస్య యద్వృణుతే రీత్యుజ్జ్వలాంస్వాం తనూం
శ్రీహర్షః కిము రాజశేఖర ఉత శ్రీనాథ ఏష స్వయమ్ ||

యస్సర్వగం సర్వత ఆప్యహ్యాష్ట్రో
జ్యోత్స్నాను మేఘేషు ధునీవనీషు
జగౌ లతాంతేషు విహంగమేషు
గీతిం మనః ప్రాణసుఖాఽవహాం నః ||

కవీనాం సేనాన్యే ప్రబల కుకవి క్రౌంచ దళన
స్ఫురద్గీర్బాణౌఘ ప్రస్ప్రమర మహాసేన మహసే
శివాం బ్రూమో వాచం శివయువతి పాదాబ్జ వికస
ల్లలాట జ్యోత్స్నాయ ప్రకటమిహ శేషేంద్రకవయే||

మహచ్చిత్రమేత న్మహచ్చిత్రమేతద్
గిరేర్నందినీ చేందిరా ద్వే మిళిత్వా
పరంకౌతుకాదాంధ్ర వాగ్దేవతాయాః
స్నుషాత్వం ప్రపన్నే మృషానో వచోమే||

వాచ్యాద్యన్నిరగాచ్చిరాద్భుతవిధి స్స్వస్త్ర్యస్తువై వేధసే
ద్వంద్వం యత్ స్పృహణీయశోభ మసృజ చ్చక్షుష్మతాం ప్రీతయే
జ్యోత్స్నా చంద్రమసోర్యథైవ సుషమారాకా నిశాస్విందిరా
శేషేంద్రద్విజయో స్తథైవ ఘటనా సర్గస్య భూషావిధిః ||

కో2 హం కావపిచయువాం
కుతోను మయి వా మనీదృశీ ప్రీతిః
జానే నకిమపి కాంతిః
చాంద్రమసీ హ్లాదినీ స్వభావేన ||

అధమర్ణ ఇవా2త్మా మే
వ్యథతే కేనాపి సౌహార్దభరేణ
లభతాం నిభృతాం నిర్వృతి
ముభయోరిహ కావ్య సంప్రదానేన ||

సమస్స్వయంభవే తస్మై లీనదిక్కాల సంవిదే
హార్దాయ జ్వలతే నిత్య మార్ద్రాయైవాస్తుతేజసే ||

(శరభయ్యగారు తాము అనువదించిన 'విక్రమోర్వశీయం' నాటకాన్ని గుంటూరు శేషేంద్రశర్మగారికి అంకితమిస్తూ చెప్పిన శ్లోకాలివి. శ్రీవారి సంస్కృత కవితకు మచ్చుతునకగా ఇక్కడ ఇవ్వడం జరిగింది).

# శరభ సూక్తుల సౌరభాలు

(ప్రాచీన కవులను గురించి , కావ్యాలను గురించి
మల్లంపల్లి శరభయ్యగారి అభిప్రాయాలు)

చైతన్య కవితా వేదిక
ఆర్ 2, జ్ఞాన భారతి
బెంగుళూరు 560 056.

# శరభ సూక్తుల సౌరభాలు

## వాల్మీకి

"వాల్మీకి కంఠంలోనే కరుణగంధం ఉన్నది. అది వెంటనే గుండెను ఒడిసి పట్టుకుంటుంది— కోకిలకంఠస్వనంవలె . కోకిలో హృదయ గ్రాహీ— అని ఆయనే అన్నారు. ఎంతయినా ఆయనది స్త్రీప్రకృతి ! ఆయనను చదువుతూ ఉంటే అమ్మఒడిలో ఉన్నట్లే ఉంటుంది".

## వ్యాసుడు

"వ్యాసునిది పురుషకంఠం ! 'ఆయన చెప్పినట్లు వినకపోతే ఏమవుతుందో' అని భయం వేస్తుంది. ఆయన ప్రేమ పైకి కనబడదు. ఫలిత సమయానికి కాని అనుభవంలోకి రాదు. సరిగ్గా మా నాన్నగారి వంటివాడు".

## కాళిదాసు

"ఈ సృష్టిలో కాళిదాసు కవిత్వంకన్నా నిజమైన ప్రియురాలు ఉండటం అసంభవం. ప్రియురాలి విశ్వరూపమే ఆయన కావ్య ప్రపంచంగా మారింది."

## భవభూతి

"భవభూతి అసాధారణమైన కవి ! మొగలి రేకుల వలె ఆయన శ్లోకాలు ప్రాణాలలోనికి సొరవేసుకొని పోతాయి."

## భాసుడు

"భాసుడు సన్నజాజి పూవు వంటి కవి ! ఆయన ప్రతిభ రేకగా ఉన్న నెత్తావి వలె, గుండెకి పట్టి, ఉల్లాసం కలిగిస్తుంది."

## ✓ నన్నయ

"నన్నయ్య మాటల చుట్టూ వెన్నెల కాస్తూ ఉంటుంది. ఆయన రాత్రివలె ఆప్యాయనమైన కవి ! వాల్మీకిది వలె ఈయనదీ స్త్రీప్రకృతి!"

### తిక్కన

"తిక్కన్న పట్టపగటి వంటివాడు ! ఈయన శిల్పం చతురస్ర శోభిగా ఉంటుంది. సూక్ష్మాతిసూక్ష్మమైన రేఖలు కూడా విస్పష్టంగా ఉంటాయి. పురుష ప్రకృతి."

### ఎఱ్ఱన

"ఎఱ్ఱన్న ఇటు పగలుగానో, అటు రాత్రిగానో కరిగిపోయే స్వభావం కల సంధ్యారాగం వంటి కవి ! ఈయనలో దివానిశా లక్షణాలు సమపాళంగా ఉంటాయి. ఈయన అసలు స్వరూపం వ్రేపల్లెలలోని కీలారాల లోనే వెదకి పట్టుకోవాలి."

### నాచన సోమన

"నాచన సోమన్న మండువెల మధ్యలో ఉన్న నిండు వెల ! ముందు— ఆ గ్రీష్మాతపానికి తట్టుకోగలిగి ఉండాలి!"

### శ్రీనాథుడు

"అందరి హృదయాల లోనికీ ప్రియాతిథివలె సరాసరి ప్రవేశించే ఒకేఒక తెలుగుకవి శ్రీనాథుడు! ఈయన మాటలలో నుండి ఎన్ని శతాబ్దులు గడచినా, ఎప్పటికప్పుడు క్రొత్తగా – అక్షయ్యమైన కస్తూరీ సౌరభం తెరలు తెరలుగా వీస్తూనే ఉంటుంది."

### పోతన

"ఏ జాతి అయినా తరించటానికి ఇటువంటి కవి ఒక్కడు ఉంటే చాలును."

### శ్రీకృష్ణదేవరాయలు

"శ్రీకృష్ణదేవరాయలు మూర్తీభవించిన వర్షఋతువు."

## అల్లసాని పెద్దన

"మలయానిలానికి రేగిన మల్లెల పుప్పొడీ,
ఆ పుప్పొడితో చిక్కబడిన వెన్నెలా,
ఆ వెన్నలతో వచ్చిన కలువతేనే,
ఆ తేనెతో మత్తెక్కిన తుమ్మెద పాటా,
ఆ రీతి తుమ్మెద పాటతో
కట్టలు త్రెంచుకొని పారే విరహిణి యేడుపూ –
ఇవీ–
పెద్దన కవిత్వానికి మూలద్రవ్యాలు !"

## ముక్కుతిమ్మన

"సాయంకాలం పూసే చంద్ర కాంతం పూవంత సుతిమెత్తనైన ఒకే ఒక తెనుగుకవి ముక్కుతిమ్మన."

## వసుచరిత్ర

"ఐశ్వర్య ప్రదర్శనాభిలాష కల శ్రీమంతులైన వర్తకుల సౌధములలోని నానావిధమైన ఫర్నిచరూ, వస్తువాహన సామగ్రీ."

## తెనాలి రామకృష్ణకవి

"మంచుతో మెఱిసే హేమంత ప్రాతః శాద్వల స్థలి !"

## పింగళి సూరన

"చెఱకు తోటలతో,
పండి ఒరిగిన వరిచేలతో,
పోకలకు ప్రాకించిన తములపాకు తీగలతో,
అరటి తోటలతో,
సమశీతోష్ణమైన శరత్కాలము !"

## చేమకూర వేంకట కవి

"చేమకూర వేంకటకవి తిరుపతి వేంకటకవులకు మూల పురుషుడు !"

## కవితా నిర్వచనం

"తన భర్త చేసిన అసమగ్రసృష్టిని చక్కపరిచి, సమగ్రం చెయ్యటానికే సరస్వతీదేవి 'కవిత' పేరుతో ఈ లోకానికి దిగివచ్చింది."

## సహృదయ నిర్వచనం

"కవి నివసించే – (కావ్య నిర్మాణ ఫలమైన) శాశ్వత స్వర్గ ధామం (ఈ లోకంలో) సహృదయుడు !"

## కవితా ప్రయోజనం

"దుఃఖమయమైన యీలోకాన్ని ఆనందమయంగా పరిణమింప చేయటానికే 'కవిత' ఆవిర్భవించింది."

## అష్టమ వ్యసనం

" మన పెద్దలు సప్తవ్యసనాలను మాత్రమే చెప్పారు. నా ఉద్దేశంలో వాటికి ఇంకొకటి కూడా చేర్చాలి; అదే కవిత్వం ! కవిత్వం అష్టమ వ్యసనం !"

– మల్లంపల్లి శరభయ్య

* * * *

ఆకృతి రామచంద్ర విరహాకృతి, కన్బొమతీరు స్వామి చా
పాకృతి, కన్నులన్ ప్రభు కృపాకృతి, కైశికమందు రామ దే
హాకృతి, సర్వదేహమునయందున రాఘవ వంశమౌళి ధ
ర్మాకృతి, కూరుచున్న విధమంతయు స్వామి ప్రతిజ్ఞమూర్తియై.

—విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము,
సుందర—పరరాత్ర, 139.

అట్టవెనుక ఛాయాచిత్రం :

## పరబ్రహ్మమూర్తి

కవితామ్నాయ రహస్యముల్ దెలియగా గాక్షించి నావేని పా
మ్మవనిన్ నీ వెవనిన్ దలంపక తదేకాసక్తితో జేరుమా
కవిసమ్రాట్టగు విశ్వనాథు ప్రతిభా గంభీర వారాన్నిధిన్
శివకోటీర ఝరీ తురీయ వచన శ్రీ సన్నిధిన్ బెన్నిధిన్ !

ఎవని యాకృతి మించు హిమశైల శిఖరమై
కవులలో పుడమి మానవులలోన
ఎవని భారతి వెల్గు నేకైక దీపమై
జగములం దాగామి యుగములందు
ఎవని మన్గడ యొప్పు శ్రవణ పీయూషమై
కథలలో సూరి వాక్సుధలలోన
ఎవని స్థానము గ్రాలు నవనవోన్మేషమై
ఋషులలో నిఖిలానిమిషులలోన

అతడు కవియును ఋషియు దేవతయు గాడు
కవులు ఋషులును దివిజులుం గలసి మేలసి
గ్రుక్కు సాక్షాత్ పరబ్రహ్మమూర్తి గాక
విశ్వనాథుండు కేవలావిర్భవుండె !

* * * —శేషేంద్ర

మంగళ మహాశ్రీ :

చిత్తజ తనూభసిత శేఖరిత రేణు పరిశీర్ణ నిచయ స్నపిత భావా !
మత్తగజదైత్య గళమంథర నవాసృగతి మంజుల తనూకలితహేలా!
వృత్తదళ ముక్తితరు విస్ఫుటిత భక్తిఫల విద్యుతిత మోదరస రూపా !
ప్రాత్త నిజధర్మచయరక్త జనతాకృతి పరంపరిత మంగళమహాశ్రీ!!

—విశ్వనాథ (రామాయణ కల్పవృక్షములోని చివరి పద్యం)

# చైతన్య కవితా వేదిక
బెంగుళూరు

| | | |
|---|---|---|
| గౌరవాధ్యక్షులు | : | శ్రీ టి. పట్టాభి రామిరెడ్డి (పఠాభి) |
| అధ్యక్షులు | : | శ్రీ డి.కె. ఆదికేశవులు |
| ఉపాధ్యక్షులు | : | శ్రీ బుల్లా సుబ్బారావు, ఐ.ఏ.ఎస్<br>శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠి<br>శ్రీ కె. పి. రావు |
| కార్యదర్శులు | : | ఆచార్య తంగిరాల సుబ్బారావు<br>డా. ఆర్వీయస్. సుందరం |
| సహ కార్యదర్శులు | : | డా. పి.యు.బి. శర్మ<br>శ్రీ కె. చంద్రప్ప<br>డా. ఎం. రుక్మాంగద నాయుడు<br>శ్రీ వి. రామనరసింహారెడ్డి |
| కోశాధికారి | : | ఆచార్య సరగు కృష్ణమూర్తి |

* * *

1993లో చేరిన పోషకులు

శ్రీమతి జ్యోత్స్నారాణి, శ్రీ కొప్పర్తి మధుసూదనరెడ్డి దంపతులు, కడప.



చైతన్య కవితావేదిక అధ్యక్షులు
**శ్రీ డి.కె. ఆదికేశవులుగారు**
(బెంగుళూరు)



చైతన్య కవితావేదిక ఉపాధ్యక్షులు
**శ్రీ బుల్లా సుబ్బారావుగారు, ఐ.ఎ.ఎస్**
(బెంగుళూరు)

# చైతన్యకవిత

శ్రీముఖ వసంతం శరత్తు 15-16



“యేన స్వీకృత శారదా కటితటీ కాంచీ క్వణత్కింకిణీ
స్వానానూన వచోభరేణ రసవారాశిస్తు గండూషితః”

చైతన్య కవితా వేదిక బెంగుళూరు